# ఆంధ్రప్రతిష్ఠ



శతావధానులు

## సత్యదుర్గేశ్వరకవులు

శ్రీమత్పరదేవతాయైనమః

# ఉ ష స్సు

మూడువందలయేండ్లు పైబడు కాలము దనుక దక్షిణాపథ ఖండమును బరిపాలించిన సంగమ సాళువ తుళువ ఆర్వీటి వంశ్యుల చరిత్ర ఇందలి ఇతివృత్తము.

ఏ జాతి, ఏ జాతీయభాష, ఎంతకాల, మెంత ఉన్నతిపై, అనుభవించి తులకించెడినో; ఆ జాతి, ఆ జాతీయ భాష, లోకమున అంతటి మహోదయముతో అంత దనుక తులతూగగలదనునది స్వభావోక్తి. ఇది అనుభవజ్ఞులకు విశ్రంభనీయము. కాబట్టియే- " ఇదమంధతమః కృత్స్నంజాయేత భువనత్రయం, యదిశబ్దాహ్వయం జ్యోతిరా సంసారం నదీప్యతే. " ఆచార్య -దండి ఉపదేశమిట్లు శ్రేష్ఠ దాటుచున్నది - కావ్యాదర్శమున. నిజమునకు అదియే సువర్ణయుగము. అట్టి శుభోదయ దర్శనమునకే ప్రజ సర్వదా ప్రయత్నించుచుండ వలయును.

భావి దేశాభ్యుదయ విధాతలగు యువతీ యువకుల జాతీయ జీవితములను జక్క-బరచునది కావ్యము. కనుకనే రః—

" కావ్యం యశసే ఽర్థకృతే శివేతరక్షతయే
సద్యః పర నిర్వృతయే కాంతాసమ్మిత
త యోపదేశయుజే. "

మ మ్మ టు డు.

Poetry reveals to us the loveliness of nature, brings back the freshness of youthful feelings, revives the relish of simple pleasures, which warmed the

strengthens our interest in human nature, by vivid delianations of its tenderest and softest feelings and through brightness of its prophetic visions helps faith to lay hold on the future life.

Channing.

ప్రాచ్యపాశ్చాత్య లిట్లెలుగెత్తి చాటుచున్నారు. దేశ పురోగమనమునకు ఉద్యమించెడు యువ ప్రజ, మహనీయులగు తన పూర్వీకుల ఆ మహోత్కృష్టపు జెయిదములను ఆకళించుట; ప్రప్రథమ కర్తవ్యము. ఆ నాడుగాక, అజ్ఞానహిమకణముల జెమ్మగిల్లిన తద్రక్తనాళములకు గవోష్ణత చెనకదు. దేశశ్రేయోదాయులగు నవనవ్యాసృక్స్రోతః పూరములాకుల్య ప్రతోశులందప్పుడ పొంగి పొరలి జాలు వారును. కాబట్టి తాదృశమైన కావ్యోదయ మెప్పుడును దేశమునకు ఆవశ్యకమే, అయిన, ఆ కావ్యసంపద— "శ్రోతుర్మనో వశీకృత్య హితంవక్తి సహేతుకమ్‌·" సాహిత్యసారము. పుట ౧. శ్లో॥ 15,

"Poetry, according to Milton's famous saying, should be simple, sensuous, impassioned.' Essays in criticism. P. 100. By Matthew Arnold.

ఈ ప్రవచనముల కనుకూలముగ ఉన్నప్పుడే లోకోపకారి కాగలదు, అప్పుడే- "విశ్వశ్రేయః కావ్య" మ్మను .వాగనుశాసనుని ఉక్తి అన్వర్థమగును,

ఒకవైపున, గాకతీయాంధ్ర సామ్రాజ్యము మాటినది; మరొకవైపున భరతఖండము నిరంతర బాధలకు గురి అయి ఉన్నది. అట్టి విషమావసరమున, ఆంధ్రులకు తుంగభద్రాతీరము సుస్వాగత మిచ్చినది. అంతట నుండి, తిరిగి ఆంధ్ర ప్రాజ్య సామ్రాజ్య సంపదః [illegible]

"పునశ్శ్రీ" శీర్షిక పొదపెట్టబడినది. ఇట్లే, తక్కటి అధ్యాయముల శీర్షికలును అర్థవంతములు.

అనాడా సందిగ్ధ సమయమున, హరిహరదేవరాయ లట్లాంధ్ర సామ్రాజ్య సంస్థాపకుడను కీర్తి బొసకగలిగెననిన: దాని కంతకు మూలము, కేవల భగవదవతారముగు ఆ విద్యారణ్య మహర్షి అంతయే.

చివరి మూడువంశముల వారును, ఆంధ్రులనుట విదితము. ఇక, మొదటి వంశపు జన్మకథ గ్రహణీయము. వీరిపట్ల, చరిత్రకారుల త్రోవలు భిన్న భిన్నములుగ ఉన్నవి— కన్నడులని కొందరు, తెలుగు వారని మరికొందరు. మహర్షి— విద్యారణ్య డాంధ్రుడని: శ్రీ. కం వీరేశలింగంపంతులుగారు, తమ కవుల చరిత్రలో వ్రాసి ఉన్నారు.

ఆ సోదరులును, ఆంధ్రులనియే కొన్ని నిదర్శనములు వక్కాణించుచున్నవి. హరిహరరాయలు, బుక్కరాయలు: వీరు సంగమ రాజుపుత్రులు. ఈ సంగమవంశ మాంధ్రీయమని ఈ— "These indications, al-though dim, point distinctly to the telugu descent of the Sangama line of kings". Eliot & Dawson. III P. 247. పంక్తి స్పష్టీకృతి చేయుచున్నది.

ఈ— "The Government founded by foreigners was also supported by foreigners and in the Centre of canara, a Telinga court was supported by a Telinga army". Wilks: vol. 1 P. 9. పంక్తియు, వారి ఆంధ్రత్వమును ధ్రువపరచుచున్నది.

మరియు- "Warrangal has fallen ......... but a branch of this family appears to have removed to Vizayanagar on the Tungabhadra and founded a

Kingdom there"............ఫెరిస్తా. Therefore, on the evidence of the Contemporary historian Barni, we are justified in assertaining that Harihara and Bukka, the founders of the Empire Vizayanagar, were persons of Telugu Extraction. ........................ Kampili and Vizayanagar. P. 26.

ఈ పంక్తులను తత్సమన్యము, పరిష్కరించుచున్నవి. ఈ అంశ మును బలపరచెడు గ్రంథము లింకను కొన్ని కలవు.

ఇక ఇవ్వి, డది విద్యానగరాంధ్ర సామ్రాజ్య మనదగును. అ యీ ముఖ్యకారణముల, బ్రస్తుత కావ్యమునకు "ఆంధ్ర ప్రతిష్ఠ" అని నామకరణము చేసితిని.

ఒరిస్సా రాజు తనయకు గృష్ణదేవరాయలకు, జరిగిన వివాహము పట్ల గొన్ని భిన్నాభిప్రాయము లున్నవి. అయిన, దిమ్మరుసునకు మేనల్లుడు రాయలకు సమకాలికుడు అగు నాదెళ్ళ గోపమంత్రి వ్రాసిన ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్యలోని ఈ—" ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య పుత్రీం పవిత్రీకృత భూతధాత్రీం; ప్రత్యగ్రహీ ద్యః ప్రకటప్రతాపో భద్రాం సుభద్రా మివపాండవేయః. "శ్లోకము పరమార్థమును వెలిబుచ్చు చున్నది.

సమకాలికుల ప్రవచనము లనతిక్రమణీయములు. ఆమె భర్తృ నిర్వాసితయై, కొంతదనుక ఏకాంతవాసినిగ రోజులు గడపబెట్టినట్లు

"The fact that the other two Queens figure prominently in some of the records of the reign, while the orissaprincess figures nowhere,lends colour to the tradition that she was neglectd''.

అదేకాలమున, ఆమె తన భర్తకు సందేశముగా బంపిన తుక్కా పంచకములోని ఈ—

"చరణ వనాంతే నవ మంజరీషు, న షట్పదో గంధఫలీ మజిఘ్రత్:
సా కిం న రమ్యా? స చ కిం న రంతా? బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

శ్లోకము తదేకాంత వాసమును స్పష్టీకరించుచున్నది— ఆమెకు తుక్క, అన్నపూర్ణ అను రెండు పేరులు కలవనియు, తుక్క అనగా దుర్గ అనియు తజ్ఞులు నుడువుచున్నారు. ఆ సమయమున ఆమె కదపబిల్లాలోని కంభమువద్ద త్రవ్వించిన తటాక మిప్పటికిని దర్శనీయమై యున్నది. ఈ కథ తత్వశ్రీ ఘట్టమున దర్శనీయము.

రామరాయలు చక్రవర్తి యని పలువురి ఆశయము. అతడు కేవలము ప్రతినిధియే. అయినను, పేరు ప్రతిష్ఠలు గలవాడు: సర్వతంత్ర స్వతంత్రుడు. నాటి చక్రవర్తి సదాశివదేవరాయలు.

అందుకు— A few epigraphs from Miduturu in the Karnool district (Nos. 409, 410, 412-14 and 417 of 1926) mention two chiefs .................. as the King's (Sadasiva Devaraya's) fewdatories. Annual Report on South Indian Epigraphy 1925–26page113 ఇది సాక్షి యనదగును. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును తమ "అళియరామరాయ "లను గ్రంథమున ఇట్లే వ్రాసి యున్నారు. 1542. క్రీ. శ. ఇది అతని పట్టాభిషేక కాలము.

తాళికోట సమరరంగమున గడుంగడు బలాధికుడగు రామదేవరాయని పతనమునకు మోదపెట్టబడిన పుక్కిటి పురాణములు కొన్ని యున్నవి. అవి కేవలము సత్యదూరములు. అంతటి మహా బలిష్ఠుని పతన మూరక మాటలతో నగు కృత్యముకాదు. ఆ ఓటమికి మూర్తిగ కుట్రయే మూలమని ఈ— "These two Captains,

being of one religion with the four kings who were Moores (Mahammadans), wrought means with them to betray their own king into their hands." Purchas, X, P P. 92—3. by C. Frederick. వాక్యము ఘోషించుచున్నది. అట్లు కానిచో, తప్పక ఆంధ్రులే గెల్చి ఉందురు. బహమనీ ప్రభువు లంద రొకటై వచ్చినను. అఖండ సామ్రాజ్య ధౌరేయులగు ఆంధ్రులనట్లు కన్నెత్తియైన జూడజాల; రిక, గెల్పెక్కడిది? నిజమునకు వారికంతటి బలమును, లేదని ఇదే గ్రంథకర్త: "These four kings were not able to overcome this city and the king of Bezeneger"......... ఇట్లు వ్రాయుచున్నాడు. ఇది యంతయు, సమరశ్రీ ఘట్టమున జూడనగును.

దక్షిణ భరత ఖండము నంతను, విద్యానగరాంధ్రులు పరిపాలించిన ట్లీ కావ్యము నుడువుచున్నది. అయిన, ఒరిస్సా భామినీపతులు తేరా? అను సందేహము జనింపవచ్చును పాఠకులకు. భామినీపతులపై ఆంధ్రుల పలుకుబడి చెలామణియైనట్లు, కృష్ణదేవరాయని చరిత్ర, సదాశివదేవరాయని చరిత్రయు, వేనోళ్ళ జాటుచున్నవి. ఇక, కళింగోత్కల రాజు కూడ, ఆంధ్ర కిరీటమునకు సామంతు డని ఈ:—

"It seems, however, that the king of Orissa, one of those conquered by Krishna Devaraya, acknowledged the sovereignty of Sadasiva, as we may deduce from the grant of 1558 of Timmaraja, described as son of the King of Orissa. Arvidu Dynasty of Vijayanagar. P 55. సూక్తి వ్యక్తీకరించుచున్నది. కృష్ణదేవరాయని కాలమున గూడ, ఉత్కలరాజు తలవంచినట్లు చరిత్ర చాటుచున్నది

నేగునట్టి బయలు", ఇట్లు తనకవితావిహారమును, విశ్రమింపజేసినాడు మన చరిత్రలో. ఆంగ్లేయులకు భరతఖండమున నివసింప దావానిచ్చిన మహోదారుడు, మన తెలుగు చక్రవర్తి అని— " We know that in 1639 the King of Vijayanagar was named Ranga or Sri Ranga,................Mr. Day, the head of the English trading station at Madras, obtained from the King a grant of land at that place......................... on which Fort. St. George was afterwards con structed". A Forgotten Empire. P. 223. ఈ సంగతి ధ్రువపరచుచున్నది. ఇయ్యది, నేటి ఆంధ్రులు గర్వింపదగును. ఇందలి ఇతివృత్తపు పరిమితియు ఇంతవరకే— 1335—1644 A. D. ఈకావ్యము నిమిత్తము, పరిశోధితములైన ముఖ్య చరిత్ర గ్రంథములు నిందు వివరించితిని.

రాజమండ్రి.
28-8-46

ద్వా. వేం. వి. న. త్య. శా. స్త్రి.
శతావధాని.

గౌతమీ గ్రంథాలయము, రాజమహేంద్రి.

| గ్రంథము. | గ్రంథకర్త. |
|---|---|
| హిందూదేశకథాసంగ్రహము (మహమ్మదీయమహాయుగము) | కోమర్రాజు లక్ష్మణరావుగారు |
| జీర్ణకర్ణాటకరాజ్యము | చిలుకూరి వీరభద్రరావుగారు |
| జీర్ణవిజయనగరచరిత్ర | కుందూరి ఈశ్వరదత్తుగారు |
| A Forgotten Empire (Vijayanagar) | Robert Sewell. |
| The Arvidu dynasty of Vijayanagar | The Rev. Henry Heras. |

శ్రీరామమోహనలభక్తి పుస్తక భాండాగారము: రాజమహేంద్రి.

విజయనగరసామ్రాజ్యమందలి
ఆంధ్రవాఙ్మయచరిత్ర 1,2 భా॥ — పేరుమళ్ళ అచ్యుతరావుగారు
అళియరామరాయలు — చిలుకూరి వీరభద్రరావుగారు

ఆంధ్రసాహిత్య పరిషత్: కాకినాడ.

రాయవాచకము — విశ్వనాధరాయనిస్థానాపతి.
Studies in Vijayanagar polity — K. Eswara Dutt. M. A.
Kampili and Vijayanagar — N. Venkataramanayya, M.A.PH.D.

**ARTS COLLEGE, Rajahmundry.**

Yet-remembered Ruler of a long forgotten Empire. (KrishnaDevaraya of Vijayanagar) — S. KrishnaSwami Ayyangar
Studies in the history of the third dynasty of Vijayanagar. — N. VenkataRamanayya. M.A.
Vijayanagar: origin of the city and the Empire — N. VenkataRamanayya. M.A.

**P. R. COLLEGE, Cocanada.**

Sources of Vijayanagar Empire — S. KrisnaSwami Ayyangar
Social and political life in the Vijayanagara Empire Vol. 1-2 — Dr. B.A. Saletore M.A. PH.D.

The Andhra Historical Re-search Society: Rjy.

Origin, Growth, and Decline

శ్రీ

కృతిభర్త:



శ్రీయుత బలభద్ర వెంకటరాజు,

శ్రీమత్పరదేవతాయైనమః

# సమర్పణము.

శ్రీగలవాఁడు, భక్తకుల శీతకరుం, డఖిలార్థవేది, స
ర్వాగమ తత్త్వముల్ దెలిసి నట్టి బుధాగ్రణి, మాధురీ ప్రభా
వాగమృత ప్రశస్తుల ప్రపంచ మయుండగు విష్ణుమూర్తి, శో
భా గురుదృష్టిమై గనుత, వైశ్యకులోద్భవు వేంకటాహ్వయున్.

పడగళల గోత్రుఁడగు బలభద్రి వెంక
ట చల మను నాతఁ డీ వంగడాన ముఖ్యుఁ
డార్య భాషల నాసక్తి నంది తిరుగు
వాఁడు గలవాఁడు దేవతాభక్తి నెపుడు.

వర్తకమ్మున, నిరతమ్ము బరగు వాఁడు
ఆతఁ; డాతని అర్ధాంగి ఆమె బావ
నమ్మ; వారల కిరువుర, కవతరించె
లలిత గుణియైన వెంకటరత్న; మవని.

అతనికి తత్సతీ తిలకమా అల సుబ్బమ యందు పుట్టె దే
వత లన బెద్ద లన్న గడు భక్తి వెలార్చెడు వాఁడు, పాత్రతా
వితరణ మున్న వాఁడు, గుణి, వేంకటరాజు; సుసాధ్విసుబ్బరా
జతనికి ధర్మపత్ని; సిరి సంపదలుం గలవాఁ డశేషతన్.

అతఁడు బాండాడ గంగయ్య ఇతని బెంచి
పెద్ద జేసిన వ్యక్తి; ఆ పెద్ద మనిషి
తాత ఇతనికి, తల్లికి దండ్రి; పేరు

పెద్దవాడై పుట్టి వెంకటరమణ, ఆ
యన భార్య మంగతాయారు; పిదప
రెండవ వాడై ధరిత్రి ఉద్భవ మందె;
సూర్యనారాయణ సూను; దవల
మూడవ పుత్రుడై పొడసూపె ఉన్నట్టి
వారలలో, వీరభద్రరావు
నాలవ వాడై జనన మూనె వారల
యందు బ్రహ్మానంద; మపని యందు

ఇంక, ఆడు సంతున బ్రభవించె బెద్ద
కూతురై పుష్పవతి; చిన్న కూతు రయి జ
ననము నందిన, దల రంగనాయ కమ్మ
క్రమముగా నేటి; కీ వణి గ్దంపతులకు.

అనుకొన లే దొకప్పుడును, ఆంధ్రప్రతిష్ఠను నీకు అంకితం
బొనరుతు నంచు; స్నేహమును, ఉండిన యట్లగుపింపదింత కుర్
మును పెటు జూచినన్ మనకు; బూర్తిగ ఆ పరమేశ్వరీ శుభే
క్షణములె దీని కంతకును కారణ; మోయి, వణి క్కులాగ్రణీ!

అది, ఒకనాటి దివ్య దుదయం; బల చోటు బజారువీథి; అ
య్యెదనున అప్పు, డేనును మ దాప్పుడు వెంకటరత్నముల్ గృతి
వదిదమును గూర్చు మంత్రణములం బడియుండ; అదే క్షణంబునన్

ఆతఁడు నందివాడకవి సంతతకు మున్నె ఎరింగి యుంటి, దా
నాతని నుండి నన్నును మ దంతరముం గ్రహియించి, ఉల్లస
చ్చేతసుడై భవ ద్గృహము చెంతకు దోడ్కొని వచ్చె, సీకు వి
ఖ్యాతి ఘటించు పూన్కి అపు; డద్భుతనాంధ్ర కవిత్వభూములన్

అప్పు డెరిగితి, అతడు బొండాడ వారి
ఇంటి నరసింహ మని; భవ ద్వృద్ధి, కోసుడు
మలయు జూచెదు నీ మేనమామయని; వి
పశ్చి దభిమాని యని; బలభద్ర వంశ్య!

తొందరపుంబను ల్నదుమ దోగితో లేదొ; అదేశగాన, మ
మ్ముం దగ మేడపైకి గొనిపోయితి; వంతట మేనమామ మా
టం, దులకించు అర్థము కడంట గ్రహించితి; నాపయిం గృతిం
బొందితి; వాంధ్రపుత్ర! పదువుంగల మానిసి వైతి; వింతకున్.

కట్టితి, పాండురంగనికి గౌతమి యొడ్డున ఆలయమ్ము; శే
వట్టితఖండ సంపద గృపామయుడా తని గొల్చె; నేమ, సా
మ్రాట్టుల కేని జేకొనగ రాని మహాకృతి నంద గల్గి; తి
మ్మట్టుకు, ధన్య జీవివి సుమా; బలభద్రుని వెంక టాభిధా!

మన తెనుగుం బ్రదేశపు దుమా, మరలక్ బురణింప కుందునా!
ధనికులలోన వాఙ్మయపు దాహమొ; లేక, కవీంద్రచంద్రులన్
ధనికతయో; చివిర్చి బహుధా పొదలాడిన: గాని, ఇంతకుక్
గనబడ దా అదృష్ట; మనఘా! మన గడ్డ మహత్వ మెట్టిదో!

కలిగిన దింత; ఇంక, తెను గమ్మకు గూర్చెదు ముద్దు పట్టిపై
మొలగుము;నాది ఈ తెలుగు మేదిని,నాది తెలుంగు బాస అగ్ర
పలుకుల మాతృ భూమికిసపర్యలొనర్పుము; కాంచు మింతగా
గలిగిన దానికిఁ ఫలము; గాంచుము, వెంకటరాజ! శ్రేష్ఠతల్.

చక్రవర్తుల నిండుసభల వేదికలపై
పొంగలించిన తొకప్పుడు తలిర్చి
విరవీగినది పృథ్వీశుల దర్బారు
లందున గొంత కాలమ్ము నిలిచి
ప్రతినిధిరచ్చలఁ గ్రాలె గొన్నాళ్ళ కృర్వ
గడ్డకు నాగరకత నమర్చి
తెగబారె మంత్రుల మొగసాలలం గొంత
దనుక స్వజాతీయ తను వెలార్చి
తెనుగు నుడికార; మిప్పు డా దినము లెల్ల
మారిపోయిన; విక, ప్రజా మందిరములె
మేలు కోవలె; మాతృ భూమిం గలట్టి
పూర్వ సౌభాగ్య, మపుడె పెం పొందు; నోయి!

మున్నూ రేడులు 'దక్షిణా పథము సంపూర్ణంబుగా ఏలి చే
కొన్నా రాంధ్రు లఖండ వైభవయశఃకూజత్ప్రభుత్వోన్నతుల
ము; నా పూజ్య చరిత్రయే ఇది; ఇటుల్ పుష్పించె ఆనాటి ఆ

# పునఃశ్రీ

శ్రీకారమ్మున జెంగలించు మొలికల్ రేకెత్తెనో యిందుమూ
స్నకాలంబునన్నైన; జాగిలము లీక్షింపంగనే పారిపో
వీకుందేలున కీ మహాద్భుత మనో వీర్యాది శౌర్యంబు, లా
హా! కన్పింపగ హేతువేమొ; విధి వాహ్యాళి విధంబెట్టిదో!

అదిధాత్రీ మహిమంబకావలయు; లేదా, ఆంధ్రసామ్రాజ్యప్రా
గ్విధిపౌనర్భవలాభముండవలె భావిన్; మెట్టుకే మూనో, ఈ
హృదయశ్రీ వెదజల్లుచున్నయది యెంతే దివ్య సంపుల్ల స
మ్మదితానంద ప్రసూనసౌరభ పయఃపూరమ్ము నేడిమ్మలన్.

ఇవి తుంగభద్రాపరిసర భూములు. అదుగో - ఆకసి
పించునది భువనేశ్వరీ ప్రసన్నులగు విద్యారణ్యుల తపో
భూమి. ఆ వైపున గోచరమగునది మాకుల దేవతలు
పంపావతీ విరూపాక్షుల ఆలయము. అది జగజ్జనని -
భువనేశ్వరి ఆయతనము. ప్రకృత మాపవిత్రస్థల మనస్య
దర్శనీయము. హృదయ రవళియు నట్టే ఆవిష్క-
రించు చున్నది.

మునుపటిస్వప్నమందుగల ముఖ్యవిశేషములిప్పుడుండియును
గనులకు గట్టినట్లుగనె గన్పడు చున్నవి; కాలమెప్పుడు
జనదాకరీతిగా ననడునాసుత్ ఇయ్యెడనిక్కమూయె గు
ద్రునివచన ప్రకారము గురుప్రసాదన్ గనుగొంటి మాధవున.

ఇంక, సామ్రాజ్య రమయులభింపగలదు
సంశయింపగ బనిలేదు, జరిగి తీరు
భగవదుదితమ్ము లెప్పుడు; భళిర! అదుగొ!
ఇచ్చటికె వచ్చుచున్నాడ హీనుడతడు.

ఇదెనమస్కారమయ్య, యోగీంద్ర! నేడు
మానసంబేమొ, పరిమితిలేని హర్ష
వీచికలమధ్య ఆకాశవీధిస్వైర
గీతికలుపాడుచున్న; దేకీభవించి.

వేటకై జాగిలమ్ములు వెంటనుంచు
కొని ప్రవేశించితిని, ఈవిజనతలమ్ము;
అంత గుండేలువీని వేటాడదొడగె;
ఏమిచెప్పుదు, వెరగగు నెంతయేని.

అరసితిసర్వ; మింక, వెను కాడక, ఇందొకపత్తనమ్ము న
త్వరముగగట్టి, ఆవెనుక, తత్పురిముఖ్య పురమ్ముకాగ, ఓ
హరిహరరాయ! ఏలుకొను మాంధ్ర మహాధరణీతలమ్ము ని
బ్బరముగ; ఆనెగొందిపుర పార్థివ! నీకుజయమ్ముగావుతన్.

మానవాకారమును బోలి మాన్యచరిత!
ఆ పురంబుండవలె; నట్టు లలరు నేని,
విజయవంతమ్ము ఆంధ్ర పృథ్వీశ్వరత్వ

ఈప్రదేశమ్ము నందు జన్మించు నెట్టి
చేనటికైనను, ఎనలేని చేవకలుగు;
చూచితివికదా కుందేటి చోద్య పటిమ;
అసలు, దానికి అట్టి సాహసము కలదె?

ఆంధ్రం బాంధ్రతయున్ సమస్తమును పోవ్రట్టిపోయె, ఆ కాకతీ
యాంధ్రశ్రీ నశియించుటన్; ఋషివరేణ్యా! నేటి మీ యత్నాలతో
ఆంధ్రత్వమ్ము పరిమళించెడి; తదీయారంభమున్ నేడె స
ర్వాంధ్రుల్ మెచ్చగ జేయగావలయు; విద్యారణ్య! క్షేమాప్తికిన్.

అంతియేకాదు, భూపతివగుటనీవు
ఊహచేయవు; మన భరతోర్వి నేడు
పడెడు బాధకు మితిలేదు; పార్థివేంద్ర!
బాధ్యతాయుతమౌ ప్రభుత్వమ్ము లేమి.

ఒకసమయాన భారతమహోర్వికి బాలకవర్గము ప్రపం
చకమున సాటిలేనిదని సద్యశమున్ గొనినట్టి ఆంధ్ర జా
తికి, విధి ఇప్పుడెట్టి గతి దెచ్చెనొ చూచితె? ఆంధ్రరాజ! నీ
విక, తెలుగుం బతాక పులకింపుము; రాజులు మెచ్చి వింతటన్.

తమయశశ్చంద్రికా తపవియద్వీధుల ఆంధ్రులు క్రీడించినట్టి దశలు
ఆత్మదోర్బలమున కరులు భీతిగొనగ దన్ను వారవని దిగ్గజదినాలు
స్వప్రభావంపు సౌభాగ్యపిచికలలో మనక [illegible]

హృదయ దృక్కుల ఆదృతిగదియబట్టి
ప్రకృతదివసాలతో జతపరచి చూచి
తెలుగు జెండా ప్రభలు వియద్వీధి నెగయ
దిరిగి ప్రయతింపవోయి; పృధ్వీతలేంద్ర!

ఉదయాస్తాచల సేతు వింధ్యనగమధ్యోర్వీతలంబెల్ల, ఆం
ధ్రధరిత్రీ హృదయ ప్రభుత్వమున కార్యాలోంగుకాలమ్ము ముం
దుదయింపంగల; దుద్యమింపుము, పతాకోత్థానముల్ జేసి; తె
న్గుదివాణమ్మును భారత ప్రజకు దిక్కుంజూపి పాలింపగన్.

భవదాజ్ఞన్ శిరసావహించితిని, దేవా! మీరలత్యంతముల్।
స్తవనీయుల్, బహుశాస్త్రవేత్తలు,ఋషీంద్రఖ్యాతి సంపాదక
ప్రవరుల్,గావున; మీరు మంత్రిపదవీంద్రత్వమ్ము నందుండ, భా
వ్యవనీరాజ్యము నేలగా హృదయకావ్యశ్రీ మహాస్ఫూర్తియున్.

కనుక, దీనికి మీరలేకారణమ్ము।
నేనిజూపించి వెనుదీయబూనవలద।
టంచు బ్రార్థన; పిదప, నిర్మింపబోవు।
నగరమున, కాత్మనామము మొసగుము; దేవ!

అందులకేమి? కాని, ఋషినై ఒకమూల దపస్సుజేసికొం।
చుందివసమ్ములన్ గడపుజోగికి, నాకు; ధరాధిరాజ్యసాం।
బంధికమంత్రి పీఠమిడవచ్చునో; ఇచ్చిన, రాజ్యతంత్రవుం।

లౌక్యులున్నారు; వారికీజోక్యమిత్తు।
వేని, హరిహరరాయ! లాభింపవచ్చు;।
పిదప, నీకునుకొంచెము వేగిరడంగు;।
తగినవానికి సాచివ్యధాత్రినిడిన.

మీకన్నన్ మహిలౌక్యు లెవ్వరికి? సామీ! మీరలాత్మప్రభా!
శ్లోకుల్ గామి వచింతురిట్లు; ధరణీ లోకమ్మునం దెందునన్
మీకుం జాలినదిట్టి కన్పడునె? భూమీరాజ్య మంత్రిత్వమా।
ర్యా! కై సేయుము; నీవలఘ్నుడవు, విద్యారణ్య! ఎప్పట్టునన్.

జోగులు రాజకీయముల జొచ్చిన లాభములేదు; వారికిన్।
సాగదు లౌక్యపుంబటిమ; చాలదు శక్తియు నంచు మీరలే।
లోగడ అన్నమాటలు ఛలోక్తులు; మున్నలమౌర్య రాజ్యల।
క్ష్మీగతికిం దివానెవరు? కేవలయోగికదా; ఋషీశ్వరా!.

పైకిచూచిన గోపీనపాత్రధారి।
అతడు; చేసిన కార్యంబు లద్భుతములు;
వానికిం బ్రతి నాటి ప్రపంచమందు।
ఉండెనే? వాడు మీవంటి యోగికాడె?.

సెలవిక, యోగిపుంగవ! వశీకృత సర్వదిగంత తత్వ! నీ।
వలన దెలుంగురాజ్యము సుభాసితమై మునుముందు బెంపుసాం।
పలరి తురంగ లింపగల;దాంధ్రులకుం దగినంత స్వేచ్ఛ రా।

సరె లెమ్మన్నట్లె పౌనర్పవచ్చు దెలుగుకన్యానాథ! మాయాశ్రమాం
తరమందే దివసాంతమున్ గడపి, అంతన్ రేపు మీ యూరికిన్
దెరలన్ వచ్చును; భారతీయులకు అతిథ్యావనం బెంతయున్
గరణీయమ్మ కదోయి! రమ్మ గతశంకాయుక్త చిత్తుండవై.

అక్షయ నవ్యపద్ధతుల నాంధ్రప్రభుత్వము బాదుకొల్పగా
నీక్షునగొన్న మీకుగుల దేవుళునౌ అలపంపయున్ విరూ!
పాక్షులు నందు ఆయతన మల్లదె; అద్భుతది యోస్వభక్తర!
క్షేత్రిణి నాడుపాస్య భువనేశ్వరి ఆలయము; మాంధ్రభూపతీ!

ఉదయమున లేచి కార్యంబులోలి దీర్చి
భావి కార్యంపు సిద్ధికి వారిదర్శ
నమ్ము జేసుక వచ్చుట నయము మనకు
గావలయు గాదె? తత్సహాకారమిపుడు.

ఎంతటిమాట! వచ్చుటకు ఏమి? కడుంగడు పావనమ్మిదే
పాంతములన్ బదంబిడుట లస్మదగణ్య ఫలస్మహోదయా!
కాంతిగదా; పదండిమరి, కౌతుకమున్ మొలతెంచుచుండె, ఆ
శాంత యశోవిశాల! హృదయమ్మున ఈనిలయాలు జూడగన్.

ఉభయుల ఆననంబుల మహోదయ పుష్పములుద్గమించి సౌ
రభమిడగా దొడంగె; అనురాగపు బాష్పలవోర్మిబిందువుల్
ముఖగములయో వారినెరిచూడ్కుల; భావిమహాంధ్ర రాజ్యపుక్

# ఉ ద య శ్రీ

ప్రథమసాచివ్యసంపద్విస్తరంబునం,
దలరిమాధవబుధుండధివసింప।
ప్రాజ్యమహీరాజ్యమ్ము ప్రథమానుజుండైన
కంపభూపతిచూచి కాచుచుండ।
హొసలభూరాజ్య మోర్మికన్పడవీర
బుక్కభూపాలుండు ప్రోచుచుండ।
వనవాసి ధారుణీభారముద్యచ్ఛక్తి
మారభూపతి పూని మనుచుచుండ.

ఆంధ్రవిద్యానగర రాజ్యమాత్మశక్తి
అవఘళింపగ స్థాపించి హరిహరుండు
దేశదేశాంతరముల ఆత్మీయకీర్తి
క్రమ్మ బాలింప సింహాసనమ్మునెక్కె.

మాధవవిద్యారణ్యుల
సాధనమునరిపుల గెలిచి సశ్రీకత్వా
రాధితగోవాపురిధా
త్రీ ధరుడాత్మీయమైన దేశముజేర్చెన్.

రాజ్యంబెల్ల సుభిక్షమయ్యె; రిపుగర్వంబీగ; రాజ్యమ్ము, సా
మ్రాజ్యంబయ్యె; విధిప్రభల్ వెలిగ; సంభావించభాగ్యమ్ము; స్వా
రాజ్యంబో అనదోచె ఆఖరకు; ఆంధ్రశ్రీప్రకాశించె; స
ద్భోజ్యంబయ్యె మహీంమహాదశ; మహాభూపాలుకాలంబున

హరిహర దేవరాయని మహాంధ్ర ప్రభుత్వములంతకంతకున్
ఉరవగుచుండె; కన్నడము హొసలమున్నగు అన్యరాష్ట్రముల్
దరియ వెలుంగుభూమి బహు భాగపెరిగెన్ కలిసెన్ విశాలసా
గరపటుతీరముల్; వివృతిగాంచెను ఆంధ్రులవర్తకం; బిలన్.

ఆంధ్రరాజ్య సంస్థాపకుడన్నకీర్తి
ఆతనికిదక్కె; దయనభయంబొసంగె
కాందిశీకావ నీంద్రుల; కాత్మపూర్వ
కమ్ముగా: నాటి ఆంధ్ర భూకాంతుడతడు.

ఆతడు స్వీయనామము మహాంధ్రచరిత్ర పుటాంతరంబులన్
పూత మెరుంగు లీనదగు పుత్తడి యక్కరపుందళత్తళ
ద్యోతిత కాంతిలోనతులదూగగ మాధవు పేరభక్తినై!
ఆతరిహంపి దేవళమటంచొక దానినిగట్టె; నున్నతిన్

అతడు త్రిలింగభూపతి మహాధరణీ పరిపాలకత్వపుం
జతురిమగల్గితా నొక ప్రశస్తపుటాంధ్ర మహీంద్రుడయ్యు స
న్మతివిడనాడ బోడు; నడుమంత్రపు భాగ్యమునన్ గలంగుగ
ర్వితునిబలెన్; మహామహుల వృత్తము లెందుబరార్థముల్ కదా

కలగానయ్యె సమస్తలోకముల ప్రఖ్యాతమ్మునౌ కాకతీ
యులఆంధ్రాభ్యుదయంబటంచు మదినెంతో మల్లడిన్ గొన్న ?
తెలవాడాగణి హృత్సరోవరము; అత్యంతమ్ము హార్దాంబు

అతని కరవాల మందలి ఆంధ్రతత్వ
మురవణించుట గాబోలు, ఓడిపోయె
నాటి ఢిల్లీప్రభువు; తెన్గుధాటి నాటి
జడములనుగూడ, ఉరళింప సాగ నేమొ!

# వంశశ్రీ

హొసల పాలకుండయి మహోన్నతిగాంచిన బుక్కరాజు సిం
హాసన మెక్కెబిమ్మట; మహామహుడై అరిరాజ వీరసం
త్రాసకుడై దిగంత విస్తృతామలకీర్తి విశాలుడై దయా
భాసితుడై మహాంధ్ర జనపాలనతత్వ సమర్థ గామియై.

ఈ నరనాయ కాగ్రణి అహీనదయాహృదయుండునై తెలం
గాణపుగాకతీయనృపకాంతులకున్ సమరాన ఊతగా
దాన పరాక్రమించె; దనధాటికి; శత్రువు లోహటింప, ఢి
ల్లీనరనాయకాదులు మరీమరి, ఆత్మల బిచ్చలింపగన్.

పోటీలేని బలిష్ఠు డప్పటి మహాభూపాలు రం, దుద్భటా
ర్భాటారి ప్రళయాంతక, ప్రముఖు, డీ రాజన్య; డెన్నేసియున్
బాటించెన్ స్తవనీయకృత్యములు; సంభావించె దా శైవపుం
బాటంబట్టియు, అన్యమార్గగుల; ఏర్పాటించె విద్వత్క్రియల్.

ఆరజపుంగవిత్వముహాయల్ పచరింపగ జెప్పితత్కృతో
ద్ధారకుడైన నాటి కవితాపతి నాచనసోము; డాంధ్ర పృ
థ్వీరమణుండితం, డెగయుదెంచిన భక్తి నొసంగినట్టి జా
గీరుల, దొంగలించి వెలిగెన్; అది ఎట్టి సువర్ణకాలమో.

గౌరీదేవి వీర బుక్క మహీపాలుని అర్ధాంగి. రెండవ
హరిహర రాయలు ఈమె తనూభవుడు. తండ్రి తరు
వాత ప్రభుత్వ భారము వహించి నిరుపమ శూరుడై

క్షితిపుడు. దక్షిణా భరత ఖండము నంతను స్వాధికారమున ఉంచగలిగిన రాజ్యవర్ధనుడు. మతాంతరములను స్వమతము సమైక దృష్టిగాంచిన సర్వమత సహిష్ణుత గలవ్యక్తి. విద్యాదేవి ఇతని కాలమున నిరంకుశముగా విహరింప గలిగినది. న్యాయము పరిఢవిల్లినది. ఈ యనకు చోళ పాండ్య మహీపతులు సమిత్ర్యరాజులైన కనగదీ కృష్ణులు. గోవా నగరాధీశ్వరులును అట్టివారే. దేవాలయాదులకు బహు భూములను దానము చేసిన విశ్వదాత ఈమహీపాలుడు. శ్రీమతి మల్లాంబిక ఇతని పట్టమహిషి.

అతని పుత్రుడు విజయబుక్కాన సింధు
డరుల కత్యంత దుర్గమంబైన ఆంధ్ర
విజయ నగరావని రాజ్యపీఠి నెక్కె-
నంత; పౌరులు ప్రహ్లాదమందునట్లు.

విజయ నగరం బదెంతయు వెంపుజెంది
పశ్చ్యదార్యుల నేత్రసంపత్తుకాగ
మల్లడించుచు నుండె ఈ మనుజవిభుని
కాలమున; అది నాటిసంస్కార మేమొ.

ఈత డానాడు పూని త్రవ్వించినట్టి
పంట కాలువ అచ్ఛోద భాగ్యశాలి
నాటి ఆంధ్రత్వగరిమ మీనాటి దాక
చాటుచున్నది తెలుగు బజారులందు.

దూరమున మూరురులఁ దునిమె; తూరుపుదేశపు పెత్తనమ్ము లొ
బరచుకయుండె; దివ్యమగు పద్ధతి నొక్కటి ఆనకట్ట నే
ర్పరచెను తుంగభద్రికు; సరాసరి తండ్రికి ఉద్ధిమై ప్రజా
దరమువహించె దెస్గువసుధాపతి ఈతడు; నాటిరోజులన్.

పిమ్మట గౌడదేవపృథివీ పతి తత్సహజన్ముడాంధ్రరా
జ్యమ్మును ఏలబూనె; తదనంతరమాతని పుత్రుడు డౌదలన్
ముమ్మరపుందమిఁ విజయభూపతి పూనె; అనంతరమ్ము మూ
ర్థమ్మున దాల్చె ప్రౌఢ వసుధాపతి తత్తనుజుం డఖిన్నుడై.

కడపటి కాకతీయ మహీ కాంతునకున్ దురమందు దోడుగా
వెడలి మహోగ్రతఁ రిపుల పీచమడంచి తదీయరాజ్యమున్
విడివడజేసె ప్రౌఢపృథివీపతి చిక్కులనుండి; రాజ్యమున్
గడలుకొనన్ జరించె; సమకాలపురావుతులోడి క్రమొక్కఁగఁ.

ప్రజలన్ వెంపరలాడి దేశగతసౌభాగ్యమ్ము నూడ్చఁ మహా
ధ్వజముం బాతిన నేటి కట్నపువిషాదం; బప్పుడుంగూడ, ఆ
రజపుం బాటలు దీర్చియుండగ; దదార్భాటమ్ము భేదించి స
ర్వజనీనుం డయి దేశదేశముల సంపాదించె; గీర్త్యున్నతుల్.

పోర్చుగల్ పార్శ్యకాది భూమిపతులు
బహుమతులనిచ్చి దూతలబంపు చుండ
ఇతని ఆస్థానమున; ఈ మహేంద్రు కీర్తి
చంద్రికల తోట, కట్టె ప్రశస్తికలహా!

ఈ ధరణీశ్వరుండు కలిపించిన ఓలగమం దశాస్త్ర వా
గ్వాదముతోన డిండిముని గర్వముమాన్చె మహామహుండు శ్రీ
నాథుడు; దానికిన్ నృపతి నచ్చి కవీంద్రుని ఓలలార్చె శో
భాధికమైన హాక్త్రికవి భాసితశాల; పసిండి కాసులన్.

శీతల గంధ వాహముల చెల్వపు హాయికి దారి జూపు వా
కైతల రాణి మేల్మినుడి కారపు రాచరికంపు పంట భా
షాతురకోటి తృప్తిపడు నట్లుగమించె; దదన్యసత్కళా
వ్రాతమునున్ ఫలించె; జన పాలుడు వీని ప్రభుత్వదక్షతన.

విలయము లేని ధైర్యపరిపీత నృపాగ్రణి ప్రౌఢదేవరా
యలు; తదనంతరం బతని ఆత్మజ ముఖ్యుడు మల్లికార్జును
డిలధరియించి కొంతవడి నేలె; ప్రభుత్వముచేసె ఆపయిన్
గల ధరణీశ్వరానుజుడ; ఖండముగా నొకకొంత కాలమున్.

అల విరూపాక్ష నృపతియనంతరమున
అతని సేనాని అరిభీకరాకృతుండు
దండి గలయట్టి సాళువ గుండవంశ

ఈతని కాలమందు సుకవీంద్రులకుం దగినంత ప్రోద్బలం
బాతతమై లభించె; గృతినందెను జైమిని భారతమ్ము ఈ
భూతలనాయకుండు; పరిపూర్ణముదావహులైన, సరస్వతీ
మాతృదయాపు్రైన, కవి మాన్యుడు పిల్లలమఱ్ఱి దేర్పడన్.

పండితుడైన సాళువనృపాలుని పిమ్మట, రాజ్యలక్ష్మిను
ద్దండుడు తుళ్వ వంశమున దద్దయముఖ్యుడు నర్సరాయు, లా
ఖండల కల్పుడై కొని అఖండముగా ఒక వెల్గు వెల్గె; బ్ర
హ్మాండము గా గవీ డ్వన విహారములం బొనరించె; నెమ్మికన్

నంది మల్లయ్య కవియు అనంతరమ్ము
ఘంట సింగయ్య కవియును గలసి వ్రాసి
నట్టి అల వరాహ పురాణమందె గృతిగ
ఇతడు నరసింహదేవ పృథ్వీశ్వరుండు-

తిప్పాంబ, నాగమాంబ, ఓబాంబిక: ఈముగ్గురు నరస
రాయని పట్టపు దేవులు. వీర నరసింహరాయలు తిప్పాం
బకు బుత్రుడు. శ్రీకృష్ణ దేవరాయలు నాగమాంబకు
జనించిన పుత్రరత్నము. అచ్యుతరాయలు, శ్రీరంగ
రాయలు: వీరు ఓబాంబికా తనూభవులు.

వీరనరసింహరాయ పృథ్వీశ్వరుండు
పండితుండైన నరసభూపాల వరుని
పిదప బట్టాభిషిక్తుడై విజయ నగర

తీటలడంగ ఆంధ్రనృపు దీధితికిన్ గరముల్ మొగిడ్చు క
ర్ణాటక భూపతుల్ వదవిహారమునన్ మితి మీరిపోయి స్వే
చ్ఛాటనముం బొనర్ప;అను జాధ్యుతి శౌర్యమహాస్సునన్ దదా
ర్భాటముమాన్పగల్గె మన రాయలు; తెన్గునసీబు పేర్వడన్.

సాళువ తిమ్మరాజు, పరిషజ్జన పూజ్యుడు, రాజరాజు నీ
రోలగమందునున్న అనురూపపు మంత్రుల ముఖ్యమంత్రియై
కాలము బుచ్చుచుండ; తుది కాలమునందొకనాడు, ధారుణీ
పాలుడు డాయ బిల్చి యిటు పల్కెను; స్వార్థపరాంతరంగుడై

నాకవసాన కాలము కనంబడుచున్నది; తమ్ముడన్ననో
తేకువజూపి ఈసకల దేశమునేల గలట్టిదిట్ట; మం
త్రీ! కొమరుండు కాంచునెడ ఎంతయుగుఱ్ఱడు; కాన, వానినిక్.
వీకకొలంది, నీవ పృథివీశ్వరునిం బొనరించి కాచినన్.

కావున, గృష్ణరాయుని మకామున కేగి, తదీయనేత్రముల్
చేవదలిర్పబీకి, దయసేయుము, నాకిటజూపగా; మహా
ధీవర! దాన, గుఱ్ఱని అధీనమగున్ ధరయెల్ల; కృష్ణరా
జేవిధినైన అప్పుడెదిరింపగ జాలడు; తథ్యమింతయున్.

నీకుసహోదరుండు; ధరణీశ్వరపుత్రుడు; పండితుండు; సు
శ్రీకమనీయమూర్తి; ఉరరీకృత సర్వజన ప్రియుండు; రా
జా! కలయందునైన ఎదురాడడు నీ; కటువంటి సద్గుణా
ఢ్యుని నిటుల్ పోవగ అనురూపమె? నీకుఁ దెలుంగు పతీ!

అతడు భవత్తనూభవుని కంటెనఖండుసు; చక్రవర్తిగా
గుతలమునేల గ్గలెడి అకుంఠిత తేజుడు; రాజ్యవృద్ధినా
యతముగ బోహాణింపగల ఆంధ్రమహీంసుతు; దట్టిసూరునిన్
గతమొనరించినన్, దమకుగాక, మరేరికి లోటు? భూవరా.

ప్రకృతము మీరు నాహృదయ వాక్యములక్ష్యముచేసి కృష్ణుని
విశ్రుతుబొనర్తురేని; తమ వీరిడిసేతకు నేటి ఈప్రజా
సకలమెకాక, భావినృపజాలకమా నిజ వంశమెల్ల; ఆం
ధ్రకువలయేశ! మిమ్మొకవిధంబగు భావముతోడ జూచెడిన్.

అదియునుగాక, భూప్రజలకందరికిఁ హితుడైనవాని ఈ
విధముగ వేపకూడ; దటు వేసిన, ముప్పుఘటిల్లు; నెండియుఁ
ప్రథితు, డతండు, ధీరుడు, పరాక్రమశాలి, కవీంద్రు, డట్టి బె
ట్టిదుడలరారినఁ, దమకడిందికి ఊతగదా; మహీశ్వరా!

తనయుడు గద్దెనెక్కి వసుధాపరిపాలన చేయునప్డు, నీ
అనుజుడు రాజ్యలోభమున ఆత్మజునేవిధి మోసగించునో
అని అనుమాన మొంది ఇటులంటివి; కాని, మహాశయుండతం
డని ఒకయింతయున్ దలప; వక్కట! ఆతని పుట్టువెట్టిదో!

పలికవైతి; ధర్మవు గ్రహించిన వాడవు; పెద్దయింటిధీ
శాలివి; అట్టి నీవిటులసత్కృతి చేయగనోపుదయ్యా; భూం
పాల! తదీయమైన అపవాదొక మీయదె కాదు; మంత్రికిఁ

పలికినమాటకుఁ బములుపల్కి యథేచ్ఛగ రాజరాజు నా
జ్ఞలు వృథచేయు నేరపు మజా చవి చూచెనొ; లేక, వెంట నే
మొఱకువతోడ స్వార్థపు పరిమేయమునం దుపపత్తి చూపెనో;
తెలియగ జెప్పవోయి! సుమతీ! బలుపారిన నిశ్చయమ్మునన్.

ఇతడు స్వార్థోపపత్తి వాంఛించి నన్ను
గూడ తర్జింప సమకట్టె; కుతల పతుల
వద్ద కుమ్మరిపురుగుల పగిది తిరుగు
వారికే కద రోజులు; వసుధ నరయ.

స్వైరత గోలుపుచ్చు సచివత్వ మొనర్చుట కంటె సత్క్రియా
ధోరణి దేశసేవ దలదూగుట మంచిది మమ్మనంటి స్వే
చ్ఛారతులైనవారికి; విశాంపతి మీ అభివృద్ధి గోరి ఈ
తీరున బల్క; వ్యర్థపు గతిన్ బచరించెదు కోపనుండవై.

రావులు మీరు మీకడ నిరంతరసేవకవృత్తి మాది; ధా
త్రీవర! కావునన్ దమ అధీనము సర్వము; రాజరాజు నా
జ్ఞావిధతత్త్వముం దెలియజాలని జాల్ముడ గాను; కాని, మీ
భావిని గోరి ఇట్లురక పల్కితి; చెప్పుడిదే పౌసర్చెదన్.

బలుపారన్ సచివుండిటుల్ పలుకగా ప్రత్యక్షమై యెంతయున్
బలకాయించె బ్రహర్షమాత్మ; ముఖభావంబందు నుత్సేకపుం
దళుకుల్ వెల్లిగొనెన్; ఒకానొకకళా ధామంబు పాలించె నృ

మలగొనియున్న మానస సమంచిత హర్షము ప్రేగొకింత అ
గ్గలముగ నూలుకొన్న వెనుకన్, సచివాగ్రణి! నేటి కాత్మ ను
త్తల మడగెన్; ముదావహము తద్దయు గూర్చినవాడవైతివో,
కలఘురయంబునన్ జని ఎకాయెకి రమ్ము; మనస్స సిద్ధమై.

అని నృపుడు పల్క దిమ్మరా జతని మొండి
పట్టుదలకు నెగయుదెంచు బలువువంత
గురుతులన్ బైకి కనబడకుండ అల్ల
నల్లనన్ గడివెలుపల కరిగ నొదిగి.

అపు డొకకొంత సేపు మది యందు నడావుడి తాండవించె; అ
చ్చపుగనుదోయి జీకటి బజారులు దీరిచి ఆవరించె; నుం
తిప్రసుసమాళి; కంత, దిమిరీకృత మేఘ తటిద్గతిన్ మనో
విపినొకభావరేఖ బొదలించెడు పంక్తి వెలుంగు దోచగన్.

పరిమితి లేని ఉత్సుకత భావపరంపర జౌకళింపగా
త్వరపడ నుత్సహించుపదపద్ధతిలో నొకయింత తొట్రుపా
టెరియగ; మంత్రిమాళి అల కృష్ణనృపాలు నివాసమందిరాం
తరమున కేగి కాంచె; జనతాప్రియు భావిమహానృపాగ్రణిన్.

సేమమె! సార్వభౌమసుతశేఖర! నాజను పల్కు నోటరా
నేమొ రవంత మోమున అహీనకళాకృతి అంకురించి హ్రా
ద్ధామము జొచ్చి వద్దని పదంబుల వారధి గట్టఁబోవ గా

నుడివినదంతయున్ విని కనుంగవ నెత్తుని బాష్పబిందువుల్
గడలగ రాజపుత్రుడు ఎగాదిగ మంత్రిని గన్గొ జూచి ఈ
త్తలపడియున్న నెమ్మనము తాలిమి దెర్గొనెగా; బదాలు ము
ట్రెల; వదనంపు స్వేదకణ లేఖల దైన్యము దోప; నిట్లనెన్.

నాయొనర్చించు తప్పులు కనంబడ దెల్పుడు దిద్దుకొందు శ్ర
ద్ధాయుతభక్తి; ఇట్లురక ధర్మను వీడి మదీయనేత్రముల్
తీయగ బాడియే? వసుమతీశ్వరు లిట్టి అనుజ్ఞ లిత్తురే
ఏమెడనైన? న్యాయమున కిందు గృహంబులు లేవ? ధీవరా!

రాజటు చెప్పెబో, సచివరాజ! స్వతంత్రుడనైన నీవునున్
ఓజవలిర్ప గూడదని ఉర్విపతిన్ దగ మంచలింప లే
దా? జవసత్వముల్ తొలగెనా? అవికాక, తనున్ సతమ్ము అ
వ్యాజపుభక్తి గొల్చు అనుజాగ్రణి; నగ్రజుడిట్లు చేయునో!.

పతితంబైన స్వతంత్రభావలగ్నితైశ్వర్యంబులన్ దోగు ఈ
చతురంతాధిపులింట బుట్టుకలు నీచంబైన పాపమ్ము లే
క తటస్థింపవు; పేదకుండు సుఖమున్ గాన్పింప; దేమాత్ర మో
స్థితి యున్నట్టి గృహస్థు డెంతటి సుఖోద్దీప్తుండో! ఉర్వీస్థలిన్.

పరవాలే దిపుడైన, నామదిని అప్పాజీ! మహీరాజ్యసం
భర మీయూదల దాల్చు ఉత్సుకత ఏమాత్రంబు లే; దావసు
న్ధరణీభోగములం ద్యజించి యిదె సన్యాసిత్వముం బూని వ
[illegible]

అరయిక లేక, కేవలము స్వార్థపరుండయి, అన్నగారు సక
షారిగొనజూచు ఈజతనముం గనగా వెరగొందుచుండె అం
తరమిపు; డెప్పుడైన వసుధాస్థలి గోరినయట్లొకింతయుఁ
గురుతగుపింప; దైనపుడు, కూడునె? రాజున కిట్టి యోజనల్.

పలుకవదేమి? నీవును నృపాలుని మాదిరి నాపయిన్ రుషా
విలత వహించితో; సచివవీర! నిసర్గదయన్ దెమల్చితో
బలిమి, మహీంద్రునాజ్ఞ నిరవాకమొనర్చుట తప్పమిఁక; విప
చ్ఛలితు ననుం గనుంగొనియు సాంత్వనముల్ పచరింపవేలొకో

ఏమియును లేదు; కాని, పృథ్వీశుముదల
ముదలసేయమి ఎంతయు మోసమొకట
జిన్నతనముననుండి నిన్ గన్న పుత్రు
పగిది జూచుట నెవ్వగ తిగుచు నొకట.

నిరవధిక ప్రభుత్వమున నెక్కొని యున్న అపార ధారుణీ
శ్వరుడత; డీవొ సద్గుణవిశాంపతిపట్టివి; వారియాజ్ఞ స
త్వరపరిపాలనీయము; భవత్తనురక్షణమో అవశ్య మె
ట్లరసిన; ఇప్డు చీకటికొటారుల జిక్కితి నోయి పుత్రికా!

అన్నిట బెద్దవాడవు; మహాశయముల్ గలవాడ; వాంధ్రరా
జ్యోన్నతి క్రొమ్మెరుంగుల మహోజ్జ్వలమై తులకించు నీదు వి
ద్యోన్నతనామధేయ; మిక, తప్పక చేయుము రాజునాజ్ఞ నీ

నీకు గల జ్ఞానమందు గనీస మింత
కలిగియున్నను బాగుండుఁ గాదె? నృపుడు;
పాపకర్మకు వెరవని ప్రభువు నాజ్ఞ
వమ్ము గావించినను వృజినమ్ము రాదు.

కావున వేరొక తెరగున
భూవిభు నూల్కొనగ జేయ బోయెద; తుది, నీ
భూవిభవము నీయదియగు
శ్రీవరదా! కృష్ణరాయ! సెలవిక; దేవా!.

కలడు గదా నృపాలున కొకండు కుమారుడు? వాని దక్కి, ఈ
తెలుగు ప్రభుత్వ మన్యుని సుధీనిధి! ఏక్రియ జెందు నన్న? ఏ
లాలయునె? ధర్మమున్ విడిచి ఉర్వీపతిన్ దగ మోసగించి భూ
తలమును బల్మిం లాగుకొన; దక్షనృపాలుర కేరి కేనియున్.

భూతల రాజ్య భారమును మోయుటకున్ సకలైక ధర్మదృ
గ్జాతి సమర్థు; డాతడు ప్రజాదరముం గలవాడు గావలెన్
భూతదయాబలంబుల బ్రపూర్ణుడు గావలె; జెప్పరాదు గా
నీ, తమవద్ద నయ్యవి లభించెడు నన్నియు గూడ; ధీనిధీ.

మీకు నాపయి నున్న నెమ్మిక కొలంది
వ్యవహరించెద రిట్టు లప్పాజి! మీర;
లంతియేకాని; నేనొక అధికుడనె? కు
తలమునంగల పోటుబంటులు; గలర

మరియున్ భూప్రజయెల్ల నిన్ తెలుగుసామ్రాజ్యాధిపుంజేయ సం
బరముం జెందుచు నున్న దిప్పుడు; ప్రజావాదంబు పాల్యమ్ము భూ
వరులా వారికి; మోస మట్లయిన, ఆవంతేనియుంగూడ కా
దరయర్; పోయెద ఆజ్ఞనిమ్మిక, తెలుంగాధీశ! విద్యాత్మకా!.

అని వచియించి మంత్రివరు డల్లన గృష్ణుని బాసి మేక క
ళ్ళను గొని రాజరాజు శిబిరంబునకుం జని చూపగా; నతం
డను పమహర్ష భారమున అన్నకొనర్ పెదతమ్ము కన్నలే
అని మది విశ్వసించి కొనియాడె నమాత్యు; ననేక రీతులర్.

ఉబ్బిన హర్షరేఖలు ముఖోపరి నట్టిటు నివ్వటిల్లి కేరి
ళ్ళుబ్బగ; రాజరాజుకడ ఉత్తరువుంగొని లోనలేచు పే
రబ్బురపాటు లోపలనె అల్లనడంచుచు; రాజవాసమున్
నిబ్బరమైన చూడ్కి పురణింపగ వెల్వడె మంత్రి అంతటన్.

# మహః శ్రీ

ఒకసమయాన మంత్రి తనయున్న గృహోపవనాంత భూమిలో
నికి జని; మానసోత్సవము నేత్రమహోత్సవము పొల్చువోటు; ఒ
గ్రక మెయి గూర్చుచుండి; నడతెంచెడి ఊహాలలోన: గృష్ణరా
జిక ధరణీంద్రుడో; నతని కించుక బోధ యొనర్పగా దగున్.

అని యొకఊహ మానసమునందున నిల్వగ; మంత్రిగారు, ద
గ్గున అటనుండి లేచి తనకుంగల దుస్తులు జేసుకొను తే
ననువుగ దాల్చి మోసల దయారయి నిల్చినగుర్రమునెక్కి కృ
ష్ణుని భవనమ్ము జేరగ అనూనరయంబున నేగ; నేగినన్.

ఎదురయి వచ్చి స్వాగతము నిచ్చి కడుంగడు దోయిలించి అం
త, దనగృహంబులోనికి యధావిధి తోడ్కొనిపోయి గౌరవాసనం
బు దగనొసంగగా; సచివముఖ్యుడు, కూర్చొని లేతనవ్వు తొ
ద్వదనకళాగృహాల జెలువారగ; కృష్ణుని మోము జూచుచున్.

ఒకడు రహస్యపున్ వచన మున్నది నీ కెరిగింప నిప్పు; డం
దుకె ఇట కేగుదెంచితిని; తూర్ణముగా ఇటు లేచి రమ్ము నీ
వొకపరి; రాజపుత్ర! అని ఉక్తుల ప్రేమరసమ్ము చిప్పిలన్
వికసితభావముల్ వదన వీధుల లాస్యము సేయగా ననెన్.

అనినన్; వెంటనె మంత్రిశేఖరుని డాయన్ వచ్చె దా బూర్వపుం
జనవుంజేసి నృపాలపుత్రుడు; డటు రా, సర్వస్వతంత్రత్వమున్
గొని వేసెన్ ఒకచెంపదెబ్బ నతడా కుర్రన్; పడెన్ గ్రింద గ్ర

తదుపరి ఒక్కమారుగ ఎదఁ జనియించిన దుఃఖముబ్బి పె
ల్లిదమవగా; గనుంగవ బొరింబొరి నశ్రులు చిందువంద; గ
ద్గదిక స్వరంబులం బొదుగ; గౌగిట జేర్చి నృపాలసూను నా
ప్రథితుడు: ఎంతనొచ్చితివొ రాజసుతా! యని బుజ్జగించుచుఁ.

కొంతవడి కాంధ్రరాట్సూను డంతరమున
దెప్పిరిలి; మంత్రి మోమును దేరిపార
గంటి కొలికల కన్నీటి కణము లెగయ
గాంచె; గతినుల కైన అక్కటిక మొలయ.

అప్పటి ఆయవస్థకు మహాత్ముడు డెందము తేమగిల్ల; లో
ముప్పిరిగొన్న ఉమ్మలిక పొంపిరిపోవగ; భావతత్త్వముఁ
జెప్పెడు మోమునన్ నసువు జిందగ; ఓ ప్రభుపుత్ర! నేటి నా
తప్పు క్షమింపరాని; దిక, దండ్యుడ; నౌనని పల్కె నొత్తుచుఁ,

పలుకగనే మహాంధ్ర జనపాల సుతుండు—సుధీవరేణ్యా! నీ
సలిపిన చేష్ట మంచిద; నిజమ్ము ప్రమాదము లేదు; పెద్దవా
రలపని ఎట్టిదైన నతులంబె కదా అని పల్కె; నమ్రపుం
దళతళ లాననమ్మున బదార్థపు భావములెంచి చూపగన్.

అది విని, తద్విధేయతకు ఆదటపోవక, మాటిమాటికిన్
కదిసినప్రేమ రాట్సుతుని గౌగిట జేర్చుచు; ఇట్టిసద్గుణ
ప్రథితుడు రాజ్యపీఠిక నలంకృతి జేసిన, ఆంధ్ర మేదినీ

అని ప్రమదంపు టూహ హృదయమ్మున వచి తలిర్చి విచ్చగన్.
ఘనుడు—మహీంద్రజానన మొగాదిగ జూచుచు: రాజపుత్ర!సి
వనయ మఖండసౌఖ్యముల నందుచు నచిస చక్రవర్తికిన్
దనయుడ; వెట్టి కష్టమును దక్కొని యుండని వాడ వింతకున్.

బహుజన పాలనం బరయు పార్థివచంద్రుడ నొదుపింక; నా
డహరహమున్ ద్వదాజ్ఞ నడయాడెడి వారము కాని; నీకు ఓ
సహృదయ! బుద్ధి చెప్పుటకు జాలెడివారము కాము కా
న, హృదయ వీధి ఈపని కనంబడ, నిట్లానరింప వచ్చితిన్.

ఈపని బోహాణించుటకు ఏమి గతంబని నీవు నన్ను నే
డోపక పృచ్ఛ సేయ దగు; ఉత్తమనాయక! నేవు నీవు ధా
త్రీపతివై స్వపాలితుల దీవ్రపు జూపుల జూచినన్ నినున్
జూపరు నిందసేయు నని చూపితి; కొంచెము కష్టపుంజవిన్.

ఏలిక ఎప్పుడున్ బ్రజల కెంతయు దాహింతవర్తియై తదీ
యాలఘు పూన సాదరణ కష్టుడు గావలె; అప్పుడే, మహీ
పాలున కన్ని రీతుల అపార బలంబు లభించు; నాడు, భూ
పాలుని శత్రు వెంత బలవంతుడు నైన, జయింప; డ ర్భకా!

మరియున్, శ్రీగలవాడు పేదలను సంభావింప; డ వ్వారి దు
ర్భరకష్టంబుల నైన, నెమ్మది గ్రహింపం జాల; డట్లున్న, భూ
వరు డత్యంతము నింద్యుడౌ; గనుక, భూపాలుండు తా నెల్లరన్

వితరణకోసమే తమకు విత్త మొసంగెను దేవుడంచు గ
ర్హితమతు లూహసేయరు; గరిష్ఠ ధనైక మదాంధులై దరి
ద్రతతికి సాయమున్ జరుప; రంతియు కా, దిక వారలన్ రుషా
మతి నెగతాళిచేయుదురు; మాన్యులటుల్ జన; రోయి, పుత్రకా

పార్థివుడు ప్రజల సుఖము భద్రపరచి
చూపుటకు గాని, ఆత్మీయ సుఖము కొరకు
కాదు; చూడగ, అట్టిడు కంటకు డగు
ప్రజకు; చెడునయ్య, తుదకు; భూపాలపుత్ర!

రాజనిన, ధాత్రి ఆ రామరాజె రాజు;
రాజ్యమన, రామరాజ్యమే రాజ్య; మతని
మార్గమును బట్టి వెళ్ళెడి మనుజపతుల
కే, లభించును మంచి పేరిల; గుమార!

అన, విని రాజరాజసుతు డాత్మ గడుంగడు హర్ష మంది; ఓ
అనఘ చరిత్ర! మీారలు పరార్థపరుల్ ప్రధమైకమంత్రులై
తనరెడు భాగ్య మాంధ్రవసుధాపతికిన్ లభియింప; రాజ్యమం
దున జెడు గెట్లు పుట్టు? నిక, దుర్యశ మెట్టు? లధర్మమెట్లగున్?.

అంతట, ఒక్కనాడు సమయం బరుదెంచగ గృష్ణరాయ లా
శాంత మహాంధ్ర రాజ్యమున కంతకు, డా సభిషిక్తు డయ్యె; సా
మంతులు,మంత్రు,లన్యులు,ప్రమాతలుగా దను గొల్చియుండ; ది
గ్దంతుడు తిమ్మరాజు వసుధాపతి చెంగట జెంగలింపగన్.

# జయశ్రీ

సాళువవంశజుం, డటు విశాంపతి కాగనె, రాజ్యమంతటన్
గీలకపుం గడీలు బరగించె మహాంత దృఢంబుగా; జమూ
పాలనకున్ నవీన ప్రతిపాదనలుం గదియించె; గొట్టునుం
కాలను మార్చె; గాంచె జనగౌరవ; మూన; యశోమరీచులన్.

ఆ నవమోహనాంగి కలయందు కసంబడినట్టి ఆ వరా
ధీన ఫలాన అంచు గురుతించుటకున్ మతి చాలకుండె; ఆ
శానవ మల్లికా ముకుళ జాలము లట్లని ఊరబోక, ఏ
మో, నన లెత్తుచున్నవి; ఫలోదయ మెట్లను దంచ నున్నదో!

అది ఒకవేళ ఉత్కలధరాధిపు పుత్రిక యేమొ; వాని క
ట్టిది ఒక కూతురుం గలదటే! అవు నున్నది, వింటి; నాపయిన్
అధికతరాను రాగిణి యటంచును వింటిని ఆపయిన్ విశా
రద యనికూడ వింటి; బళిరా! మరి, బ్రహ్మ ఎటుల్ రచించెనో!

గజపతికూతురే అయిన, గష్టము; ఆ తరుణీమణీహృదం
బుజమున నాకునై విధి అమోఘపు సౌధము గట్టియుంచినన్
విజయ పురీప్రభుత్వ పదవీపతికిన్ పరిపంథిముఖ్యు లా
గజపతు; లట్టిచోట, మొనగట్టుదు రే? ముగమీయ గాంతకున్.

సారవిహీన, మెంత ధనసంచయ మున్నను మానవీయసం
సార; మనంతచిత్రగతి జాలెదు ఈ జగమెల్ల జీర్ణకాం
తారము; నేత్రలాభము వృథా; అల చంచలనేత్రియే, జగ
ద్ద్వారము మెట్టదేని; విధి కంతటి శక్తి ఎటుల్ లభించెనో!

అనుచు ఒకనాటి దివసాంత మందు నిట్లు
కృష్ణు డేకాంతముగ వినోదించుచుండ
ముఖ్యవిషయమ్ము లెవ్వియో ముచ్చటింప
వచ్చె అప్పాజి అప్పుడే ప్రాంతమునకు.

అంత, నఖముఖపర్యంత మవనిజాని
జూచి ఇతడేదో పెద్ద ఆలోచనమున
ఉండియున్నట్లు కనుపించు చుండె ననుచు
నిర్ధరించుక పలికె, తా నిట్టు; లపుడు.

ఏదియో దీర్ఘ యోజనాసాదివోలె
గోచరించెద; వది విన గూడు నోయి!
మాదృశాద్యన్యు; లాంధ్రి సామ్రాడ్వరేణ్య!
పిదప, ప్రత్యుత్తరించె పృథ్వీశు; డిట్లు.

అవనిన్, పుట్టినదాది నేటివర కాప్యాయంబునై నన్నుప
ద్రవముల్ నుండి తెమల్చి పెంచితివి; విద్యాబుద్ధులన్ నేర్పి ఈ
అవనీరాజ్య మొసంగి; తట్టి మదతీతాప్తుండ వీవే, రహో
భవ గోప్యార్థ మెరుంగ రానిమెడ; అప్పా! అర్థులెవ్వా రికన్?.

కడచిన రేయి స్వప్నమున గాంచితి, కాంచినమాత్రనే వియ
త్తడి దవతారమో యన హృదంబుజమున్ బెకలించి పైటలో
నిడుకొని పోవునంతటి ప్రకృష్ట నవాంగన నొక్కదాని; ఆ

ఇదియ? భవద్విచారణకు హేతువు; తెన్గునృపాల! ఆప్రియం
వద అల ఓంఢ్ర భూ విభుని పట్టియ కావలె; అంత నోయగం
బొదవిన కన్య వేరొక తె యుర్వర లేదిపు డ్రస్తసన్నగా, పసం
వద యగు; ఆలతాంగియు, భవస్థిరమున్ గొనజూచు; నెప్పుడున్.

మానుము చింత; దీని కనుమానము చెందకు; మిన్ను ముట్టు సీ
కా నవ మోహ నాంగి; సది యట్లరహింపగ నీ; ప్మై దే మనసే.
శానుడు భామినీపతుల సర్గ మొన ర్చెను, ముందు సత్యవా
త్రీణుడవౌ భవద్విపుల తేజము గూల్ప; దెలుంగు భూపతీ!

అది యటు లుండ; దక్షిణ ధరాధిపు లిద్యోడ పెద్దకుట్రలన్
బొదలుచునుండి రెంతయు; ప్రభూ! యిక, ఇప్పుడు చైత్రయాత్రయే
ఒదవు నెటుల్ దలంచినను ఉత్తమనేతలకున్; స్వదేశ సం
పద లెగయన్ రచింపు; మరి వర్గ శిరః కటన ప్రబంధముల్.

పరుల కేరికి తెలియని పరమ గోప్య
వర్తనంబుల ఇంతలు పన్నుచుండి
రేను చారుల వలన గ్రహించి నాడ
అరుల నణచంగ ఇదె సమయంబు మనకు.

కృష్ణు నెరిగింప శాత్రవు లింతలేసి
పనుల బెనగుడి నారొ? అప్పాజి! అయిన
ఎల్లి [illegible] లెల్ల జేయింపు మింక
జరుగ [illegible] కై క సమర ములకు.

ఈ నవ సార్వభౌము నెదిరింపగ శాత్రవు లింత లేసి క్షా
క్షీనములన్ బొనర్తు రని వింటి నొకప్పుడు; నైన, సర్వపా
రీణుడ వీవ యుండ, ఎవరేమి యొనర్చెద? రందు, నిట్టి క్షా
లీనులె? సమ్ముఖీను లయి లేచి ఎదిర్చెడి బంట్లు; ధీవరా!

ఏ నొకరుండ జాలుదు, నికృష్టుల వీరల నొంచి ఈ తెలం
గాణపు తొంటి గౌరవ మఖండ ప్రతిష్ఠల నిల్వ బెట్టగా;
సేనల కూర్పనేల? అనిసీమ చరించెడుపట్ల సర్వక
ర్మీణుడ వీవు తోడయి చరించిన జాలదె? మంత్రిపుంగవా!.

నిజమునకు మీర లంతటి నేత లౌదు;
రైన, నిది ఆత్ర మొందుట కదను కాదు
ముందు రాబోవు నది పెద్ద పోరితంబు
వలయు ఎంతేని పదిలమ్ము; పార్థివేంద్ర!.

ఎల్లి దర్బారు నందు యోజించు కొంద;
మింక, సెలవా? యటంచు దా నేగె మంత్రి
అంత, శ్రీకృష్ణ దేవరాయలును అచటు
వాసి పయనించె; విశ్రాంతి భవనమునకు.

ఒక సుభవాస రంబున, యథోచితవృత్తి సురార్చనల్ ముగిం
చుక సమ రాంచి తంబులగు శుభ్ర పటంబులు దాల్చి దేవాలీ
నికటము జేర వచ్చె ధరణీపతి; అల్లదె మ్రోగె, దుందుభీ

ప్రభు వటు లేగుదెంచగనె, వాకిట నున్న సమస్త వాహినీ
ప్రభువు లొకే విధాన నతులన్ బొనరించిరి శాంతిమై సమా
విభునకు; చేసి రాపయి వివేకమతిన్ సమరప్రమాణముల్
ప్రబల నిదర్శనంబులు; శుభంబు జయం బని; రంత కుల్లగాన్.

ఆ యెడ, రాజరాజు దరహాసరుచుల్ దెదజల్లు ఆనన
శ్రీయుత దృష్టి నక్కడి వజీరుల నల్లర నాదరించి; దే
శీయ దళంబు లెంచి పరిశీలనముం బొనరించి, అన్యదే
శీయ బలంబులం గని, వచించె నిటుల్; మృదు వాగ్గభీరతన్.

నిరుపద్రవముగ ధర్మ
స్థిర మతి జరియించి భరత దేశపు గీర్తిన్
నెరపుదు దేశాంతరముల
విరివిగ; ఓ వీరులార! పెంపు ఘటిల్లన్.

చేలన్ ధ్వంసము చేయబోకుడు; పరస్త్రీలన్ నయభ్రష్టులై
వాలాయింపకు; డుచ్ఛవర్తనకు నివ్వంటించి మార్గస్థ గ్రా
మాలన్ దోచకు; డన్యసేనలకు యుష్మద్వృత్తి ఆదర్శమై
గ్రాలన్ వర్తిలు; డాంధ్రకీర్తి నిలుపంగా జూడు; డెందేనియున్

త్వరపడి మీర లేమయిన తప్పిదమున్ బొనరింతురేని, భూ
వరునకు చెందు నయ్యది; అపారముగా ప్రజ లేచి నింద నే
తురు మిము; దాన, లక్ష్యము అధోగతి పాలగు కావునన్, ప్రజా
దరణకు పాత్రులయ్యెడి విధాన చరింపుడు; నిల్పుడున్నతుల్.

ప్రాణము లొడ్డియైన, సమరాంబుధిలో నెదురీదు టే పర
ధ్యానము లేని యోధుల మహాశయ; మయ్యది ఆకళించి ఎం
తేనియు సాహసంబున చరింపుడు యుద్ధమునందు; సర్వక
ర్మైణత వేడినెత్తురు శరీరములన్ ప్రవహించి మించగన్.

ఆపయి, దేశ దేశముల ఆత్మ మతి ప్రభ రాజ కీయ కా
ర్యోపచితిన్ మహాప్రభ మహోన్నతి గాంచుచు అర్ధ భారత
వ్యాపిత మైన ఈ తెలుగువారి ప్రభుత్వము లష్ట దిక్కులన్
జూపిన వృద్ధమంత్రి; నటు జూచి సమిజ్జయ సూచి సంజ్ఞలన్.

చనుడు, చనుడు,
వేగ జనుడు,
సమర గేయ
ముల రవళి,

నభమ్ము దీటు
కొను విధాన;
పరుల గుండె
లదరి, బెదర;

సేనలార!
స్వామి భక్తి,
చెలగి చూప

ఆంధ్రులారా!
కదన భేరి,
అదుగో, మ్రోగు
చున్నది: "ఇక

జయము, జయము,
చైత్ర యాత్ర
సలుపు" డంచు;
దరలు డింక.

అని సమరగేయ ముద్రేక మతిశయింప
నద్ధ బిలుపింప సిద్ధమై వరలు సైన్య
మానసంబుల నెత్తురు మరగునట్లు
పెఫ్ఫుగల గుర్ర మెక్కి గొంతెత్తి పాడి.

పెండిలి కాకమున్న పృథివిం గయిసేసిన కృష్ణదేవు, డు
ద్దండ చమూ సమేతు డయి దక్షిణపుం దెస కేఁగ; శత్రు రా
ణ్మండలి యెల్ల బెగ్గడిలు మానసముల్ సవరించుకొంచు రా
నుండిన భండనమ్మున మహోర్వీపతిన్ మరలింప నెంచఁగన్.

ముందు, మయిసూరుమండల మందు నున్న
శివసముద్రమ్ము, నిర్మలశ్రీ చెలంగి
తనరు శ్రీరంగ పట్టణ ధామ, మంత,
మొట్టూరును, గెల్చె; లోకోత్తరుండు,

గంగవంశపు రాజుల గసిమసంగి
కొడగు మళయాళ నేతల నడచి పాండ్య
చేర చోళాధిపుల నంత, పార ద్రోలి
పేర్చె; శ్రీకృష్ణరాయ పృథ్వీశమౌళి.

ఆవిధి,దక్షిణాపథము నంతయు గైవసముం బొనర్చి పృ
థ్వీవరు డేగ, ఉత్తరపు దిక్కున; కాంధ్ర జయప్రభల్ సమ
గ్రావని బిక్కటిల్లి అరిగావుల చూపులలోని మబ్బు పె
ల్లావలకుం దొలంగునటు లాత్మవిహార మొకింత చూపగన్.

ఉత్కలాధీశు పాలన నొదిగియున్న
ఉదయగిరి దాకె శత్రువు లోహటిల్ల
ఆంధ్ర రాజాధి రాజు మహా మహుండు
జయ విహారంబు లలవోక నలిపి నలిపి.

వీరభద్ర గజపతి పృథ్వీశు దాకి
ఉబుకు నెత్తుర మెరయగ నోడబుచ్చి
అతని పాలన రక్షితం బైన కొండ
వీటి దుర్గము గెల్చి గర్వించె బలసి.

వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు,తంగేడు, కేతవరము: ఈ మొదలుగాగల దుర్గములును గొండవీటికి దీసిపోవునవి కావు. అతిబలాఢ్యములు.మహారాజాధిరాజ,రాజపరమేశ్వర,శ్రీవీరప్రతాప, శ్రీకృష్ణదేవరాయలవారు వీనిని గూడ జయించి మించిరి.

శేషధరిత్రి నాంధ్ర పృథ్వీశ్వరు డంతట, ముట్టడించె; ఆ
పై, గదిసెన్ జయోద్ధతి నవాలోకనరింపగ బొట్టునూరు; అం
దా గతమైన దిగ్విజయ మంతయు దెల్పెడు కంబమున్ గవి
ద్వా గమల స్తుతుల్ నరయు బాతె; మనఃప్రసుత విక్రమ క్రియన్

బాహు బలేంద్ర వంశజుల పాలిత భూమికి రాజధాని, ని
ర్వాహకమైన సీమ, అల వత్తన; మంతటి పొట్టునూరు, దా
బాహుబలంబునన్ గొని నృపాలుడు వ్రేల్మిడి; పిమ్మటన్ మహా
బాహులు మత్స్యవంశజ నృపాలురు పాలన సల్పు భూములన్.

పొదలు వడ్డాదిసీమకు బోయి, దాని
నెట్టనన్ బట్టి, జయభేరి గొట్టి నిలిచి
విజయ లక్ష్మి పరంపర విరుల జల్లి
ఏగె సింహాద్రి; కాత్మ యొంతే దలిర్ప.

అంచితమైన భక్తి హృదయమ్మున జొక్క తదీయ దేవు సే
వించెను; పెద్దనాది సుకవీంద్రుల కైతలు చౌకళింప ఇ
ప్పించె నుపాయ నాదికము; లిమ్మగు ఆమెత లెన్నియో కదం
బించి పొనర్చె సజ్జనుల కెందరికో; జయసూచికమ్ముగన్.

అట జని, ఓఢ్ర దేశమున కంతకు గేంద్ర పురీంద్రమైన ఆ
కటకము మీదికిన్ నృపుని కంటి మెరుంగు ప్రయాణమయ్యె; అం
తట, బడవాంద్ర నెల్లర యథావిధి పంచి సమిత్ప్రయత్నముల్

అనుపద, మాంధ్రరాజు రిపుధామము జేరి అనేక రాజ సై
న్య నివహముల్ తలిర్చి తన కండగ నిల్వగ శత్రురాజుతో
ఘనతరయుద్ధమున్ జరిపె; గాని, అతండును పోటుబంటుకా
వున; ఇరులం బెనంగి సచివుం గని పల్కెను నిఃశ్వసించుచున్.

ఇంతకుమున్ను పోరు లొనరించితి మెన్నియొ; నేటిభంగి, ఆ
వంతయు గూడ ఎందపజయం బను మాటయు లేదు; కాని, ఆ
డింతకు శత్రు వీగ; డదియేమొ! విధిక్రియ ఎట్టులున్నదో
సుంత యెరుంగరాదు కద; చోద్యము లయ్యెడు; నేటిపద్ధతుల్

ఇతని కుమారుడే కద, అధీశ్వరు డయ్యెడ గొండపీటికిన్;
జితుడయి పారిపోవక, వజీరులతో ఎదిరింపగల్గెనే?
అతడు రణాన మమ్ము; మరి, అంతకు మించు బలీయుడేమొ ఈ
కుతలవరుండు; వీని గొనుగో లెటు సాధ్యమొ; చెప్పగోరెదన్.

ఆంధ్ర కళింగ రాష్ట్రముల నాత్మధరిత్రికి మేళగించి, నీ
రంధ్ర పరాక్రమ క్రమ విరాజితుడై పొలుపారు ఉత్కలో
ర్వీంద్రు డితండు; వీని బొలయించుట కష్టతరంబ ఎంత ని
స్తంద్రునకైన, నేటి వసుధాతలమందున; కృష్ణరాడ్ప్రభూ!

ఇట్టి బలాఢ్యునిన్ బ్రధన పృథ్వి జయించుట కష్టసాధ్య; మి
ప్పట్టున భేదమార్గమును బట్టి చరించుట రాజనీతి; ము
న్నిట్టి అపాయవేళల, మహీశ్వరు లివ్విధి గుస్తరించి చే
బట్టిరి, నిర్మలంబగు అపారజయప్రభ; ఆంధ్రభూపతీ!

అని వచియించు తిమ్మరుసు సర్శిని చూడ్కిం జూచి, నృపతి: ని
నదిన వచస్సు మంచిది; మహాశయా! దాని తెరంగు గూడ జె
ప్పిన బ్రమదాపహంబు కనిపించెడి, నంచు జవా బొసంగ, ఆ
తెనుగు నృపాలు; డాత్మ మొలదేరిన ఉత్సుకతావినోదియై.

వానికిని, వాని సైన్యాధిపత్య మరయు
వారికిని, భేదభావమ్ము పరిఢవిల్లి
ఐకమత్యమ్ము చెడిన; ఓఢ్రాధిపుండు
ఆజి జిక్కుట సులభ; మాంధ్రావనీంద్ర!

అని తిమ్మరుస్సు వచింపగా; అధిపు డత్యంతమ్ము హర్షించి: వెం
టనె కావింపుము దానికిన్ వలయు బందం బివ నే; డంచు, దా
ననగా: సర్వము సిద్ధమైనయది దేవా! యంచు, మంత్రీంద్రుడున్
దెనుగుం బల్కు బెడంగు లొక్కమొగి ఉత్సేకింప వాక్రుచ్చినన్

ఏది వినుచుము నీవు పన్నించి యున్న
తెరగు నా కొక్కమారు, మంత్రీ! ఒకింత
అనుచు, రారాజు వేడ; మంత్రాంగవిదుడు
పలుకు పొందిక లిగురొత్త పలికె; నిట్లు.

మీరును మీరు బంపిన నిమీలిత లేఖలు నేడ చేరె; అం
దీరలు వ్రాసియున్న ఇతివృత్తములన్ గ్రహియించె, ఆంధ్ర భూ
మీరమణుండు; మీరచన మెచ్చె; పదంపడి మీరలందరున్

ఇట్లు లేఖలు కొన్ని రచించి నేర్పు
గలుగు పరిచారికల కిచ్చి మలసి వారి
కడకు బుచ్చగ వలయు; అక్కతస, లేఖ
లన్నియుం జిక్కు మధ్య నా యవనిపతికి.

అవి కని, ఉత్కలాధిపతి: ఆత్మననున్ సమరాన బట్టి శా
త్రవపతి కొప్పగించి తగు లంచము లొంద దలంచి రాత్మసై
న్యవరు లటంచు, భీతి గొని ఆజికి రా విరమించి సంధికిన్
దివురపు; డట్లులైన, మనదేశుగు దిగ్విజయమ్ము; భూపతీ!

అసదృశంబైన యుక్తి నీ వనిన దిపుడు
మంత్రిశేఖర! లె మ్మట్లు మలయు మోయి
పాలికలను కిప్పుడేనును బోయివత్తు:
అనుచు రాజేంద్రు డేగె; దా నాజి కంత.

చివర, కప్పాజి తాను వచించినట్టి
దంతయును అక్షరాల అయ్యావసరమున
జరిపె; ఆమీద, వాని యోజన ఫలింప
భూపునకు సైన్యపులకును బోదిగ ఎడము.

ఆ యవకాశమున్ గొని, నృపాగ్రణి, పేర్చి మహోత్కలావనీ
నాయకపట్టణమ్ము నొకనాడు ఫిరంగుల గాల్చె, విక్రమ
శ్రీ యెసగంగ; అంతట, అశేష భయోచ్ఛలి తాంత రంగుడై

కొంత సేపున, కద గలగుండు డిగ్గ
అధిపు, డేకాంత సభ చేసి ఆత్మవర్గ
ప్రముఖు లెల్లర బిలిపించి: ప్రస్తుతమ్ము
చేయ దగు కర్జ మేదొ వచింపు డనియె.

కాలము బట్టియే నడవగా దగు ఎంతటి వారికైన, భూ
పాలక! వెండియున్, రిపునృపాలు డజేయుడు; ఈడులేని ఉ
త్తాల ధరాధి రాజ్యపతి; దైన్యము వానికి తోడుచూపు; ఇం
కేల, రణాభిలాష? ఘటియింపుము సంధికి రాయబారముల్.

సభ గలవార లిట్లు పలుచన్ వచియింపగ; ఉత్కళావనీ
ప్రభువరు, డంగవించి తనపాల నెలర్చెడి మంత్రి జూచి: భూ
విభు డల కృష్ణరాయని నివేశన భూమికి రాజకీయ వా
క్ప్రభువగు నొక్కనిన్, బనిచి రమ్మొకసారి; అమాత్యశేఖరా!

అనుచు, ఒడ్డోలగము బాసి అవల కేగ;
పారిషద్యులు వెనువెంట దారి; రంత,
మంత్రి రారాజు చెప్పిన మాడ్కి ప్రౌఢి
బరగు నొక్కని బుత్తెంచె; దెరగు కొరకు.

అరి కుల దుర్గ మంబులు మహాంధ్ర నృపాలు నివేశ నంబులన్
దరిసిన రాయబారి, వసుధాపతికిన్ గబురంపె; శాత్రవో
ద్ధరిత ప్రశాంతి చిహ్నిత పతాకల నంతకు బూర్వమే సమి
ద్విరమితుడైన ఆంధ్రపృథివీపతి, మంత్రిని జూచె; గొల్వునన్.

చూచిన చూపులన్ నులయు సూక్తుల వైఖరి, మంత్రియాత్మ నే
శేచ; ననుక్షణంబు, ఉరరీకృతి నంపె అతండు; పైన, వా
చాచణుడైన ఉత్కల విశాంపతి దూత త్రిలింగ రాజ్య ల
క్ష్మీచర చారణుండు తులకించెడు కొల్వున జేరె; నుల్లగన్.

వచ్చినరాయబారి ననపాయత జూచి సమంచి తాసనం
బిచ్చి నగారవేక్షలు పయిన్ బ్రసరింపగ జేయు; నాతడున్
వచ్చిన కృత్యమ్మున్ దెలిపె; బార్థివు నానతి బూని తిమ్మరా
జిచ్చె జవాబు; దానికి వచించెను వెండియు నాత డీపయిన్.

మునుపు మదీయ పూర్వుల ప్రభుత్వములం దెనలారియున్న సీ
మను, బలవంతుడై తగవుమాలి దురాక్రమణమ్ము చేసె మీ
జనపతి; దానికిప్డు తగుశాస్తిని బొందె; నికన్ స్వరాజ్యమున్
వెనుకటియట్ల తా ననుభవింపగ వచ్చును కృష్ణమట్టుకున్.

మరియు, దెలుంగు రాజ్యము బరిమాదపరిస్థితి నుంపగా భవ
న్నరపతి ఆ తురుష్క నరనాయక వర్గము తోడ గుట్రలన్
జరిపినవాడు; దాన, నిజశౌర్య మొకించుక మచ్చుజూపి పో
నరసియె వచ్చియుంటి; మది,యైనది; అయ్యెదె, మాఅభీష్టమున్.

అని మహీంద్రుడు స్వాయముగా నతని ఎదుట
సహజ గంభీర వాక్సరి చ్ఛాయము జొచ్చి
జలక మాడెను; తత్సహజ ప్రవృత్తి
కా తడెంతయు మురిసి కొండాడె నృపతి.

సకలస్వైర యుతంబుగా తిరిగి రాజ్యశ్రీ బ్రసాదించి నే
నికి, ఆపైన, దదీయ పాలిత మహీం దీంద్రించు మహా సామ్రా జ్యా
తికి, వర్జింపగ రాని బంధువయి తెంతెసిఁ; బ్రపంచాన లే
రి క, నీకుం జమవచ్చు భూపతులు; తంత్రీ! కృష్ణరాయప్రభూ!

ఆంధ్రరాట్ప్రభ మన్ననలంది; తాను
కదలి వచ్చిన పని నిరాఘాటముగ ఫ
లించె: నని సంతసింపుచు, ఏగె మగిడి;
రాణ తులకింప, ఓఢ్రుల రాయబారి.

తెనుగు పేరోలగములోని తీప్పు సరళి
అంతు లేనట్టి దఘ్న హర్షార్ణవమున
ఏకమై పోయె గొంతసే పాకళింగ
రాజచంద్రుండు నిండు దర్బారులోన.

అపజయ కారణంబున, మహాటవులం బడి పోవ నున్న మా,
కిపుడు మహోపకార మొనరించిన ఆ నృపమౌళి; కింక, ప్ర
త్యుపకృతిగా మదంబ అల దుర్గదయఁ బొడతెంచి ప్రస్తుతం
బుపచిత యౌవనాభ్యుదయ ముంగల తుక్ష నొసంగుటే; తగున్

మరియు, బుత్రిక ఆంధ్ర భూ వరుని వలచి
యున్న; దనురక్తు డతడును గన్నె యందు
కనుక, దాంపత్య మిది దైవ ఘటిత మనగ
వలయు; నెంతయు సౌభాగ్య మొలయ గలదు.

అని తలపోసి ఓలగమునందలివారల నూలుకొల్పి భా
ర్యను సలహా పొనర్చి ఇతరాప్తుల సమ్మతి జిత్తగించి వెం
టనె అత డాత్మజాత నల నాయకమౌళికి ఒప్పగించి అ
ల్లునిగ గ్రహించుకో గలిగె రూఢిమెయిన్ దన కంతివానికిన్.

ఆంధ్రమహీశ్వరుండు, హృదయమ్మున పొంగి; ప్రతాపరుద్రదం
తీంద్రుని పుత్రికామణి గ్రహించి; జయించిన ఓఢ్రరాజ్యముల్
సాంద్ర దయాంత రంగపు బిసాళి బయల్పడ, ఓఢ్రదేశరా
ట్చంద్రున కే యొసంగెను; ప్రజల్ వినుతింప దెగించి వెండియున్.

గెలిచిన సీమలన్, దిరిగి కృష్ణనృపాలుడు శాంతి పాలనల్
నెలకొలుపన్ సమర్థత గణించిన యట్టి తెలుంగు నేతలన్
మలసిన వేడ్కమై దనకు మారుగ నిల్పె; దెలుంగు బావుటా
వెలుతురు దేశ దేశ పరి వేష్టితమై నవ రోచు లేర్చగన్.

దారిపొడుగున స్వాగత గౌర వాది
సభల, జయ జయ ధ్వనుల, బ్రశస్తి గొనుచు
సతులు కవులును వెంట రా, సార్వభౌము
డరిగె నిజపురి; కాంధ్ర సైన్యంబు లడర.

# తత్వ శ్రీ

అది విజయోత్సవాల దరహాసము సేయు నమేయ సౌఖ్యసం
పదల దెలుంగు రాజ్యరమ వాస మొసగ్గు సుపర్వకాల; మా
నవవసరాన కేంద్రపురి స్థాపన మంతకు నుంచి వేయి రె
ట్లధికముగా దొడంగ; సుభగాంచిత మంగళవాద్య ఘోషలన్

వాడు శ్రీపుష్ప వైభోగ సన్నాహముల ని
మగ్నమై యుండె రారాజు మందిరమ్ము
నలుగడల బచ్చతోరణముల దలిర్చు
ద్వారముల తోడ గలకల లాడు చుచట.

పెండ్లి కూతురి తో పాటు విజయ నగర
మునకు వచ్చిన అల పరిజనము నందు
కలదు బహుతంత్ర నిపుణ ఒక్క స్త్రీ దాసి
దాని బిలుతురు ప్రజలు మంధర యటంచు.

అది ప్రతాప రుద్రగజప త్యవని పాలు
వీరసింహుని గృహ పరి చారిక; ఇతఁ
డాతనికి మేనయల్లు; డీయన యనుజ్ఞ
నిర్వహించుటకే వచ్చె నిప్పు డిటకు.

ఇంచుకయైన లోటు కనుపింపని శూరుడు; బాంధవంబునం
దెంచగ మేనబావ; ఇక, ఎంతటి సుందరమూర్తినే స్మరా
ళించెడి రూపవంతు, డల ఈశ్వరు; డంతటి మేటి, ని ట్లుపే
క్షించి తదన్యహస్తము గ్రహించితి; వే మి వచింపగావలెన్!

మిపుల బలాఢ్యతన్ బహుళ మేదిని నేలెడు నీదు తండ్రి ను
క్కివమున ఉత్క్రమించి అడకించినయట్టి అరాతిముఖ్యు డీ
కువలయనాథు; డట్టియెడ, గోరి వరించితి; పుట్టినింటి పె
కు్కవ నిలబెట్టుకో వలదె? కోమలి! త్వాదృశ రాజ పుత్రికల్.

కని పోషించిన తల్లిదండ్రుల మనఃకష్టమ్ములన్ దేర్చి ఆ
ఋణమున్ దీర్చి తదీయ వృద్ధి కిక, నీవే పూనుకోకున్న; స్వే
చ్ఛను గోల్పోయి అజస్రమున్ పరునివంచన్ ఎట్టులో కాలయా
పనముం జేసెదు అగ్రిజన్ముడటె? నిర్వర్తించువా; డీశ్వరీ!

ఇదుగో మొలకత్తి; దీని గ్రహించి నేటి
రాత్రి కృతకృత్య వగుము; స్వారాట్టు తండ్రి
గారికిం గూర్చు పట్టివి కమ్ము; పెండ్లి
యాడు మా వీరసింహు; మేనత్తసుతుడు.

అని యా మంథర పలికిన
విని "హరిహరి ఎంతమాట వినిచితివే" నే
డని మూసికొనియె వీనుల
విన నోపరు గాదె? సతులు పెనిమిటి నిందల్.

మంథరా! ఇట్టి వ్యర్థ సంభాషణమ్ము
గట్టిపెట్టుము; చాలిక; క్షాత్రలేంద్ర
పాత్రిభవుండత; డేమని వదరు చుంటి

అని మండిపడుచు గజపతి
తనయామణి అన్నపూర్ణ తర్జన సేయగ
గానగాని ఏదియొ ఇంకను
అన బోయెడు దాని నళ్లు ఆపి కరమునన్

పాలికలన్ బలమ్ము పడిపోయిన పిమ్మట, దిక్కు లేక చే
వలతిగ చిక్కువడ్డ పరిపంథికి అన్నకు రాజలాంఛనం
బుల దన రాజ్యమందు మునుపుంగల ఉన్నతి నిచ్చి ఆదృతిన్
జలిపిన ఉత్తమాత్ముడు విశాంపతి ఈ మహాసియు; దల్పుడీ?

ఎవ రెటువంటి ఉత్తములో; ఎవ్వరి కెంతటి శక్తి ఉన్నదో;
ఎవరి ప్రభుత్వ మెట్టిదో; ఒకింతయు, యోజన సేయకుండ ఇ
ట్లవరత నేచి వాగ దగునా ఇటు? నోటికి వచ్చినట్లు; సం
భవమటె? నీదు తాహతికి పార్థివముఖ్యుల నాడిపోయుటల్.

భుజ బల దర్ప శౌర్యము లమోఘముగా బ్రకటించి గెల్చుకొ
న్న జనకు రాజ్యముల్ దిరిగి నాన్నకె ఇచ్చిన స్వార్థ హీతు డీ
విజయ పురీంద్రుడు; డిట్టి పృథివీ పతి నూరి సకారణంబుగా
గజపతి కంటగింప; డిది కల్పిత; మెవ్వరు చెప్పి పంపిరో.

వైరమొ, స్నేహమో, అది అపావృత మైనది; నేటిదన్న దు
ర్వారపు బాంధవం బెటుదలంచిన; గావున, దల్లిదండ్రు లి
ట్లారయ గానిపింపదు రవంతయు గారణ; మైన, హాయిగా
దారెడు కూతు కాపురము దగ్ధము చేతురె? కన్నవా; రిలన్.

స్వపర భేదము లేక సమసిన యవనరా
జ్యము వెండియున్ నిల్పి నట్టి మేటి
వైరిభావం బీగి పగతుర సయితమ్ము
అధికారముల నుంచినట్టి ఘనుడు
బంధితలై జేత బడు నన్య కాంతల
నైన దల్లిగ జూచునట్టి నేత
వివిధ పాండితి గల విద్వత్కవుల నెల్ల
ఆశ్రయుండై మంచునట్టి ప్రభువు

అట్టి నిస్తుల రాణ్మౌళి నటమటించి
పూర్తి చేసిన; ప్రజలు లబో లబో మ
టంచు మొత్తుక ఏడ్వరే? అవల, నన్ను
లేపి దూయవె? దేశ చరిత్ర లెల్ల.

గాటపు ప్రేమ సూత్రమును గట్టిన నాథుని, జంపి ఈ ప్రజన్
జేటుల ముంచి అక్కలను జింతల పాలొనరించి నేను నా
నోటను మట్టిగొట్టికొని నుగ్గయి పోవుటకే గదా భవ
న్నాటకభావ? మెంతకయినం దగుదానవు నీవు; మంథరా!.

అని మందలించి పలికిన
విని నావచనంబు లీమె విన; దెనే ఆ
పని నెరపి స్వామిఋణ ము
క్తిని బొంది అజస్రమున్ సుఖించెద; నెలమిన్.

కాలవశాన కూఁతు నగి కర్పణ చేసిన జేసి బో, మహీ
పాలుకు; దిష్ట మున్న దన భావను దక్కఁ దదన్యు జేర నం
చేల వచింప గూడ దిది? ఎంతయు భ్రముడ దన్ను గోర కే
శ్లేలున గీలుకొల్ప దమకించు వరుణ్ నిరసింప బాటియే!

కోటివరాలొసంగినను గొందఱొక జన్మని గోర; దేన్న డీ
బోటిని అత్మలోన దలపోయుచునుం; డటువంటి రత్నమున్
గీటున బుచ్చి ఓథులకు గేవల శాత్రవు కేలు బట్టు టే
పాటి ఉదారకృత్య? మిది బాలిశ వైఖరి కాదా! చూడగన్.

జరిగిన దాని కోసము విచారణ ఇ ష్టసమంజసమ్ము; ముం
దర గల కార్య నిర్వహణ నొకను, నే నధినేత్రినై నిరం
తర సమదీక్షతో నిక, యథావిధిగా నడిపింపగావలెన్
పరమరహః ప్రవృత్తి; నెరపన్వలె మా దొరవంపు నెమ్మియిన్.

ఇపు డొకమంచియుక్తి తలయెత్తెన; దిట్టు జరించినన్ దెలుం
గుపతి పాకాలు; ఉత్కళులు గోల్కొన గల్గుదు; రీమె కాపురం
బు ఫయిసలా యగున్; దుద క మోఘముగా నట ఓద్రులెల్ల నా
యుపకృతికిన్ గృతజ్ఞులయి ఉందురు; మెత్తురు నన్నజస్రమున్.

విధివశంబున ఒకవేళ విభుడు బ్రతుకు
నేని, అనుమానమున దీని నిరసించి
వెడల గొట్టించు; అప్పుడు వెరసి రెండు

రాజగృహంబునందు గల రావుతులెల్ల రశేష పార్ష్ణి వి
భ్రాజిత వైఖరిన్ మసలువారలె కాని; తదన్యు లెవ్వరున్
యోజన సేయగా బొలిచి యుండరు నా; డటువంటి దెల్ల ఇ
ట్టే జుణిగెన్; బ్రిభాతపు నటీనటకుల్ పొడజెంచు నంతకున్.

ఎంతటి ఘోర; మీ పని రచింప దెగించిన దా కళింగ భూ
కాంతుని కూతురా! తెలుగుకాంతుని బోర జయింపలేక ఈ
ఇంతిని రేని పాలిటికి మృత్యువుగా నిటు పంపెనో అతం;
డంతియ కావలెన్; సుదిన మైనను, నేడు; తెలుంగు జాతికిన్.

అంపిన, అంపె నన్ను; తన హైందవధర్మువు క్రేణిసేసి ఏ
కొంప సదా నివాస మునకున్ విధి నిర్మిత మైనదో, అదే
కొంపకు నిప్పు బెట్టుకొని కోల్పడి పోవుట కేమివచ్చె? ఈ
తంపులమారి; కాదుది గదా ఇది? దీనికి ఇంత తెంపకే!

ఇది మన పెండ్లి కూతురె గ్రథించెనొ; లేక తదన్యు లెవ్వరై
న దెగి గ్రథించిరో; తన వినాశము దాన ఘటించుకో దలం
పొదవెడు నాడు దెందయిన ఉండున? ఈ కథ యెల్ల చూడగా
తదితర తంత్రమే యని ఎదన్ బొడక; ట్టనృతంబొ, నిక్కమో.

ఎన్నడుం గూడ, శత్రు మహీంద్రు తోడ
వియ్య మందగ రాదెంత విక్రమమ్ము
గల మహీశాను డైనను; గలన బోర

అనుపమ మైన కోపమున అగ్గయి పోవుచు నుండె నేడు మా
జనపతి; రాజకీయ పరిష త్తును లంతటి వారలే, కనుం
గొన వెనుదీయు చుండి; రిక, గోమలి! నా యటువంటి దానికిన్
పనుపడునట్టె! తాదృశ నృపాలుని దర్శన; మిట్టి వేళలన్.

ఏకత మాడగా దరుణమే ఇది? లె మ్మిక, మాకు మాట రా
నీకుము; కేలు మోడ్తు; పయనింపుము శాసన మందిరమ్ము నీ
ఏకట దీర్చునట్లు గనిపించదు నే; డని, చేటి చెప్పగా
ఆ కమలాక్షి: మంచిది తయారయితిన్ గొనిపొమ్ము టంచనెన్.

అటు పయనమ్ము గట్టి నృపు డంపిన సాయుధపుం బలాలు శా
నట నడువన్, పురాకృతము సారెకు సారెకు ఈసడింపుచుం
గటకము, లూరు, లేరులును, కాననభూములు దాటి ఆమె ఒ
క్కట బస చేసె; ముఖ్యపురి కావల, దవ్వుల నున్న బీడులన్.

ఇచ్చటనుండి ఒక్క అడుగేనియు, ముందుకు సాగ; నింక,మీ
వచ్చిన త్రోవ మీరు చన వచ్చును; భార్యకు భర్తృ గేహమే
నిచ్చలు దిక్కు కాదగిన నేల; గమింపను పుట్టి నింటికిన్
జచ్చిన, నిందె చత్తును; విశాంపతి కా, దెవ రేమి పంచినన్.

అని దొరసాని అప్డు తన అంతిమ నిశ్చయ మిట్లు దేల్చగా
విని, అటు జూడ లేని పను; ల్వి దెస జూచిన రాణి ఆజ్ఞ; లెం
డును, పరిపాలనీయము లెటుం దలపించిన, అన్న దాది నే

ఎన్నటికైన, రాణియు మహీంద్రుడు నొక్కెడ యానాడు గదివ
ట్లున్నను; జూడగా నిటునటున్ మనమే చెడువారమింక; దా
న నన్నగరంబు జేరుకొని నాయకమూర్తికి ఈ యుదంతమె
ట్లున్నదొ అట్లు చెప్పి మరియుం జనుదెంచుట శ్రేయ; మన్నిటన్

అని తమలోన దాము సలహా లొనరించుక లేచి కేంద్ర శా
సన పరిష త్పురంబునకు జయ్యన సాగి గమించె నా చమూ
గణములు కొన్ని; తక్కటి నికాయము లచ్చటనే వసించె; ఏ
గిన మొన, లే జవాబు దొరకించుక వచ్చునొ అన్నిరీతులన్.

భటు లటు జెప్పగా విని దివాణమువారు దహించుచున్న ఆ
అటవి, దదర్థ మొక్కెడు మహాగ్ని సలయించిరి; సేవ సేనిసి
పటలము బంపి; రాపయిన, బంచిరి కొంత అనీకినీ గణం
బట దొరసాని కాపుదలకై తగు జాగ్రతితోడ నుండగన్.

అచ్చట, రాణి యోగినిగనై నిరతమ్ము పదార్థజీవికన్
వచ్చుచు బోవు పాంథ జన పంక్తికి నచ్చెడు భోజనాదికం
బిచ్చు, చనాథులం గనుచు, నీశ్వరు గొల్చుచు, నొక్కరీతిగా
బుచ్చు దొడంగె; ఆ విజనభూమి వసించెడు కాల మంతయున్.

చివరకు, వీరసింహు డెటు జేసెనొ! ఉత్తమ రాజ వంశ సం
భవు లిటు లేనిపోని అపవాదములం బొదవెట్టి కాపురా
లవియగ జేయ వత్తురె ఎట్లైన? తమున్ వరియింప లే దటం

స్త్రీ లయినంత మాత్రమున, లేదొ స్వతంత్రత వారికిఁ మహా
గోళమునందు; వార లల గొడ్డులతో జమ నత్తురో; వివా
హాలను, వారలున్ బురుషు లట్లు యథేచ్ఛ మెలంగ జాలరో
పోలరొ వారికిన్ నడల బుద్ధుల; ఎందుల కీ దురంతముల్?

అక్కట! ఎంత పాపమున కై ఒడిగట్టెనొ ఎట్టకేల కా
రక్కసి; దండడించి పొదలాడెడు కాపుర మొక్క గంటలో
ముక్కలు జేసి వైచినది; మోక్షము ఉండిన, ఇట్టి పాపికిన్
జిక్కునె ఎన్నడే నది? ఇసీ! అవు డిందుకె వెంబడించెనో.

అతడొక మూర్ఖుడా; కులట, అంతకు మించిన మూర్ఖురాలు;పో
ఇతడో, అశేష రాజ్య రమ నేలెడు ఉత్తమ చక్రవర్తి; సా
హితి గలవాడు; పిమ్మట, గవీశ్వర; డట్లయి కూడ, సుంతయున్
మతి బచరింప కింత అవమాన మొనర్చె; ఇ కేమి చెప్పుదున్!

తొలి భవ పాప కర్మ మది తోడయి వచ్చుట నింత పుట్టె; ఉ
త్తల పడ కూడ; దైనను, పృథన్ ముడి పడ్డదె అప్రతిష్ఠ అం
చలదురు డెంద మా విషయ మాత్మ మెలంగెడు నప్పుడెల్ల మొ
క్కలముగ; మంచి, దెన్నడును గాల మొకేగతి ఉండబోదుగా

యౌవనపుం బ్రభుత్వ ముదయంబయి పొల్చిన దాదిగా; మనో
భావ వియ న్మరీచుల, భవ త్ప్రితి రూపము నిల్పి ప్రేమ పూ
జా విధులన్ సతమ్ము దివసంబుల బుచ్చెదు నటి నేను; నీ

పుట్టితి ఉత్కృష్టమగు [illegible] గృహంబున; నేడు, తొల్లి నా
మాత్రిట్టుని చేసి [illegible]; [illegible] మాయను గాక, అఖండ వైభవం
బుట్టి పడంగ స్వస్వీకృ[illegible] [illegible] నాకు; అక్కటా!
ఇట్టి పరిస్థితులఁ [illegible] గలవా? ప్రతో[illegible].

ఎంతటి రాజ వైనస, హృదయేశ్వర! మానవ జన్మ జేసి ఆ
వంతయు సత్యముం దలియ వైతివి; మంచిది, వేంకటేశు డ
త్యంతము నీకు ఇష్టమగు దైవమగా? అతఁడైన, నాటి గ
ల్లంతు వెలార్చ లేడాకో! చెలామణి గ్గొనవి పో; విధి ప్రభల్.

ఇంత మెఱుంగనైతి, హృదయేశ్వర! ఆ జగడంపు దాసి గో
రంతలు పల్కరాని అపలాపములన్ జత జేసి కూర్చి కొం
డంతలు చేసి చెప్ప నవు; డక్కట! ఈ కపట ప్రవర్తనం
బంతకు, సూత్రధారుడు యథార్థముగా అల వీర సింహుడే.

కలనులలో ఎదుర్కొని అఖండముగా దలపడ్డ మేటి శ
త్రులకును గూడ గ్రమ్మర గతుల్ గలిపించిన యట్టి నీవ, నే
డలచెద; వంత మాత్రపు దయార్తికి నైనను, నోచలే దకో!
వలచి వివాహ మాడిన భవద్గృహలక్ష్మి; మహీశ్వరాగ్రణీ!

అని యిటు నాటి గాథ మతియందు మెలంగెడు నప్పుడెల్ల, న
మ్మనమున గొల్లు మంచు అల మానిని రోజులు బుచ్చుచుండె అ
వ్వనమున; అంత, మెల్లగ ప్రపంచము నంతను ముట్టడించి ప్రా
కినవి: తదీయ దివ్యతర కీర్తి సుధాంశు ప్రపూర్ణ దీధితుల్.

ఇటు లతి శుద్ధ జీవిక వహించిన, దంతేటి ఘోర పాప సం
పుటికి దెగించునా? ప్రజల మోసము చేసెడు దొంగనాటకా
లిటులె రహించు; కా దది, జనించను తాపము పాప జీవికిన్
జటకున ఒక్కమా; రని ప్రజల్ దలపింపగ సాగి రవ్వేడన్.

అంత, నేరమ్మునకు మూలమైన వ్యక్తి
బైట బడినది; అంతయు, దేటదేల్ల
మయ్యె; బ్రజ లెల్ల నిర్భ్రాంతు లైరి; జగతి
నిజము నిలకడమీద ధ్వనించు; నెపుడు.

కెలకుల నున్న ప్రేయసిని కేవల మొల్లమి చేసి నాడు చి
క్కులల కెర జేసితిన్; దెలివి గోల్పడి కానల కంపి; తెంత ఉ
త్తలపడినానొ, యంచు వసుధాపతి నొచ్చి గృహాన ఉన్నరా
ణులు త్వరపెట్టగా, సతి నమానత దోడ్కొని వచ్చె నింటికిన్.

# కవిశ్రీ

ఒక సుముహూర్తమందు, సక
లోర్వీపతుల్, సచివుల్, కవీశ్వరుల్,
నికట ప్రవర్తనుల్, బుధులు,
నెయ్యురు, మున్నగువార లెల్ల నె
మ్మికసభ బన్నియున్న తరి;
మేకొని రాజు ప్రధానిగాంచి: ఇం
తకు, కవిగారి రాకడ ప్ర
ధాని! కనంబడ; దెంత చూచినన్.

అనిన, వారును వచ్చెద రాలసింప
రనుకొనిన వేళ కింతకు; ఆంధ్రరాజ!
అయిన, ఆత్మస్వాతంత్ర్యమంది తిరుగు
కోవిదులలోన; కవి నిరంకుశుడు గాదె?.

మాటనినంతనే, సుకవిమాన్యులు వచ్చిరి; రాజరాజ! ఆ
రాటము మాని వారి కెదురై చని స్వాగతమిమ్ము; లెమ్ము; వి
ద్యాటకు లెందునున్ ఘనులె; అందు, కవీంద్రుడితండు; గావునన్
గాటపు గౌరవమ్ము బొడగాంచ గడుంగడు నర్హు; దుర్వారన్.

అని, సమయోచితోక్తి దరహాసము లాననసీమ ఇంపునై
దొణికిన లాడ మంత్రిపద ధూర్వహు డల్లన బల్కగా; అదే
క్షణమున, రాజరాజు కవిగారి

సుదినము నేడు, సత్కవుల జూచుట కల్గెను; నేను మీకదా
సదనమునందు అందరు? ప్రశస్తపు టాంధ్ర కవీంద్ర! అంచనన్
ముదిత మనస్కుడై కవియు భూవరుబిం గని: నేను మందరున్
సదనమునందు, దైవిక నిసర్గ దయన్; ధర నీశ్వరాగ్రణీ!.

మును పొకనాడు, నీవు కడు మోద మెలర్పగ: పెద్దనార్య! మా॥
కనుపమమైన కావ్యము హళాయుల్ దయివారగ బోహణించి నెం
టనె కృతి నీయ గోరెద; నటంచు వచించిన యట్టి మాట, నె
ట్టనమయి నేటికిన్ ఫల విడంబిత మైనది; కృష్ణరాట్ప్రభూ!

నన్నయ్య భారతామ్నాయమ్ము గృతి నంది
వేగిభూవిభుడు సేవించె నాంధ్రి
యజ్వ తిక్కన్న రామాయణమ్ము గ్రహించి
నెల్లూరి విభుడు మన్నించె బలుకు.
జైమిని భారతాశ్రయ మంది సాళువ
గుండభూవరుడు పేర్కొనె దెలుంగు
యమకవీంద్రుల వరాహపురాణ మెల్ల బా
టించి నీ తండ్రి పోషించె భాష

ఆంధ్ర కావ్యోదయంబున, కాద్యమైన
ఈ మనుచరిత్ర; మీరు గ్రహించి నేడు
ఆంధ్ర భోజుండ వను, యశం బందు మయ్య.

అని, ప్రాస్తావిక పద్యముల్ చదువగా, ఆంధ్ర క్షమా వల్లభుం
డనఘా! ధన్యుడ నైతి; వాంఛ ఫలితం బయ్యెన్; గృతి ప్రక్రియల్
వినగా ఉవ్విళు లూరుచున్న యది ఈ విద్వత్సభా భూమి; చ
క్కని రీతిన్ వినిపింపు; మీ సభయు దగ్ధానార్థమే కావునన్.

అనిన, విని పెద్దనామాత్యు డాత్మ నలరి
గ్రంథముం దీసి అందలి రసిక ఘట్ట
పత్రములు కనుంగొనుచు; భూపాలు గాంచి
పలికె, నుడికారపు మెదర నిబ్బంగి; ముగుద.

ఉన్నత రాజ వంశమున ఉద్భవ మందితి; వంది తోత్రముల్
మన్నన సేయు జాలు కవిమాన్యుడ వైతి; మహాంధ్ర రాజ్య సం
పన్నుడ వైతి; వాంధ్ర జనపాలక! నా కృతికన్య కింక, నీ
కన్న గరిష్ఠు లెవ్వరు? మహాకవి భాగ్యము పండె; నేటికిన్.

ఏ కృతి నెట్టి ఎమ్మె పచరించెడినో; అవలీలగా, సమా
లోకన చేయ గల్గు కవులున్, బుధులున్ గల ఈ సభాస్థలిన్
లౌకిక ప్రజ్ఞ జాలు కవిరాజ వరేణ్యుడ వీవు, మత్కృతి
శ్రీకి విభుండ వైతివి, వరించి స్వయమ్ముగ; ఆంధ్ర భూపతీ!

అని, తన కావ్య మందు గల అన్ను వెలార్చు మనోజ్ఞ ఘట్టముల్
వినిచి, సభాతలమ్ము బృధివీపతినిన్ మితిలేని హర్షవుం
జనకుల ముంచి వెలసెను; వశీకృత మైనది కొలువుం గూట; మా

ఇదివర కెన్న, డిట్టి కృతి నే కవియుఁ రచియింప; డింతకున్
ప్రథమ ప్రబంధ మై తెనుగు బాస రహించెడి భాగ్య మొక్క ఈ
మృదు మధురంపు కావ్యమున కే లభియించెనొ; కాక, ఇట్టి హృ
త్స్పదన తడి త్ప్రభా పద విసర్పిత భావము లెట్లు చేకురున్?.

ఏతపముం బొనర్చి జనియించితినో! సరిక్రొత్తయై, మనః
ప్రీతికి దావలంబయి, మరే రికి పొందగ రాని, ఈ మహా
ఖ్యాత యుగ ప్రబంధ మున కంతకు నాథుడ నైతి నేఁడు; ధా
త్రీతల రాజ్య మిచ్చినను, దీరునె? నీ ఋణ; మో కవీశ్వరా!

ఏ కరణిన్ మతించిన, మహిం గల శాశ్వత కర్మలం గృతి
స్వీకృతి ఒక్కడే కద నశింపని; దట్టి కృతిఁ బసంగి ఈ
లోకములో యశమ్ము, పరలోకములో స్థిరమైన వాసమున్
జేకుర జేసి; తాంధ్ర కవి శేఖర! నా; కిక, ఏమి కావలెన్?

కృతిపతి ఇచ్చు ద్రవ్య మది ఎం తయినన్ అగు గాక నీకు; శా
శ్వతముగ ఖర్చుగాక నిలువం గలదా? ఇక, నీ వొసంగు ఈ
కృతిమణి యో—అనశ్వర, మహీన; మెటుల్ పరికించినన్ భవ
ద్వితరణమే అఖండము; కవీ! ను దుపాయన లబ్ధి కంటెనుఁ.

పాటించితివి ఆర్యభాష ముమ్మరమైన
బహు గ్రంథ సాహితీసహజ శక్తి
సంతరించితి వాంధ్ర సర్వస్వ మందున్న
సర్వ పాండిత్య ప్రశస్త [illegible]

ఆర్జింప గల్గితి వందు నిందును గూడ
సర్వ జనీనతఁ జాలు కవిత
సేకరించితివి విశేషించి దాన ధ
ర్మము లిచ్చి లోక సన్మాన్య కీర్తి.

ఏది కొదవయ్యె నీకు; కవీంద్ర! నీవ
ఆంధ్ర కవితా పితామహా అనెడి బిరుద
మునకు అర్హుఁడ వెంతేని; భూతలాన
ప్రస్తుతం బున్న కవిసార్వ భౌము లందు.

మరియును, రెండు భాసల బ్రమాణా మనోజ్ఞ ప్రబంధ రాజముల్
విరచన సేయఁగా దగిన సిద్ధ కవీంద్రుఁడ వీవు; గండపెం
డెరము ధరింప నియ్యెడ గడింటి సమర్థుఁడ; వంచు, రాజు ధ
వరు పదమందు నుంచెను; సభాతల మంతయు జూచుచుండగన్.

అంతట, పెద్దనార్యుఁడు మహాకవి కుందు గభీర భావ మా
వంతయు వీటిబుచ్చక, మహాశయు! నీవు విదగ్ధ పాండితీ
స్వాంతి మెరుంగ జాలు కవి చంద్రుఁడ వౌట గదోయి, నా కవి
త్వాంతము మెచ్చ గల్గితివి; ధన్యుఁడ నైతి; కవీంద్ర మిత్రమా!

అనుచు, కృతజ్ఞతఁ నెరపు నంతన పాలకి వచ్చె పెద్దనన్
గొని పుర మేగ; ఆపయిన, గోవిదు డైన నృపాలచంద్రు ప్రా
ర్థన నతఁ డెక్కె; భూమిపతి తాన స్వయమ్ముగ బట్టె మొత్తె పా

సత్కవిత్వం బున్న సర్వం సహా రాజ్య
మొందుల కంచు వచించు వారు
పార్థివుడే వచ్చి పల్లకి బయి కెత్తె
ఇత డెంత వాడో అం చెంచు వారు
కవులు లేరే వీని కన్న బెద్దలు పెట్టి
పుట్టి నితం డంచు బొదుగు వారు
ధాత్రీవరుండె పాదాన పెండెర ముంచె
కవిభాగ్య మని వచ్చి కనెడి వారు

తరలి మంగళ వాద్యముల్ నెరపు వారు
అనుసృతిక్ వచ్చు రాజు లోనైన వారు
బలసి చెలరేగ; గవిగారి వాహనమ్ము
తరలె మెల్లగ; జయజయ ధ్వనుల మధ్య.

నగరపు రాజ వీధుల ఘనం బొలయన్ విహరించి; పిమ్మటన్
ముగిడి, సభాతలమ్ము గరిమన్ గయిసేసిరి వార; లావయిన్
మిగిలిన భక్తి, బెద్దన కమేయపు గానుక లిచ్చి గౌరవం
బుగ బచరించె రాజు; కొలువున్ ముగిసెన్; గరతాళ నాదులన్.

# విక్రమశ్రీ

అధిపు, డలవోక దర్బారు నందు మంత్రి
ప్రముఖు వీక్షించి: బీజ పురాధి నేత
ఏమి ప్రత్యుత్తరించె? టూకించి చెప్పు;
మనిన, అర్పించె గమ్మ; మా టాడ, కతడు.

అపు డా కమ్మ ధరాధిపుండు కని కోపా టోప విస్ఫూర్తి ని
ద్దపు గన్నుం గవ ఎఱ్ఱబాఱ, రదన ధ్వానమ్ము గావించుచున్.
త్రప లేకుండగ, సర్వముం దెలిసి ఆ రాజేంద్రు డీభంగి దా
నప లాపమ్ములు వ్రాసె; గంటిరె? అటం చాడెన్; సభా భీలతన్

సేవకవృత్తి మాకడ వసించెడు సైడను వా డొకండు, ప
ర్డావులు దొంగిలించె బహుళంబుగ నల్వది వేలు; నేడు మీ
కావున దాగె; స్నేహము వృథగా బొనరింపక, మాకు వాని బృ
థ్వీవర! ఒప్పగింపు; మని తెల్పుచు, లేఖను వ్రాసి పుచ్చినన్.

ఎరిగి, యెరుంగ నట్లు నటియించి తెలుంగు నృపాలు ద్రోహి నె
బ్బరికము లేక దగ్గరకు బిల్చి సమాశ్రయమిచ్చె; అట్టి వా
డరి యగు గాని, మిత్రు డెటులౌ? నిక, మీరు రణ ప్రయత్న సం
చరణము నందె ఉండుడు; ప్రశస్త చమూ పతులార! అందరున్.

చిరత విరోధమున్ గురించి చివ్వకు బూనె మహీంద్రు, డంచు మీ
రురక తలంతురేమొ; అల ఉత్తమ దుర్గము రాయచూరు లో
బరచు కొనంగ, నేటి ఉపపత్తి సమంజసమైన; దాత డీ
[illegible]

రాయచూరు దుర్గ మాంధ్ర సామ్రాజ్య మందు
దనర వలె; అది, పిన్న ముత్తాత గారి
మరణ శాసన; మిదియ, అక్కరణ మునకు
దగిన సమయమ్ము; లెం డింక, తడయ వలదు.

ఇన్నిటి కంటె ముఖ్య మగు హేతువు వేరొక డున్న; ద్రింతకున్
ము న్నిట నున్న ఆ ఉదయ భూధర దుర్గము వారు, నేడు దా
కొన్న ప్రదేశ మాపుర; మకుంఠిత దీక్షను వార లందు, ఎ
న్నెన్నియొ పన్నుచుండి; రెటులేని, మమున్ దలమాటుచేయుగన్.

ఏది యెరుంగ నట్టు లగుపింతురు బైటకు; జూడ బోవ, ఈ
మాదిరి గానిపింతురు క్షమాపతు; లిట్టులె యుండు రాజకీ
యాదుల అంత రార్థ; మిపు డయ్యెడ మాటుగ నున్న రామరా
యాదులు చెప్పియున్న విషయం బిది; త్రోయగ రాని; దెమ్మెయిన్.

ఎంతటి దాగురింతయొ గ్రహించితి రా! ఇప్పుడైన, మీర లిం
కం తియు కాక, మా మనుజు లందర సూకిపు డొప్పగింపు మం
చంతగ జెప్పి నాడు మన మంపిన దూతను రాజసింహు, వా
రిం తయు లక్ష్య పెట్టక, కదించి అడంచిరె; బందిగమ్మునన్.

ఇక, యిపు డేచి ఆజి ప్రకటింపగ దగ్గదొ కాదొ, మీరలే
ఒక టయి నిశ్చయింపు; డిపు డూరట చెందిన, మునుండు ముందు ద
ప్పక మన పైన ఈ దురము వారె వెలార్చెద; రప్పు డంతయున్

గొలువు సమస్త మూర్తిని గొల్చు మసంగి తదీయ సమ్మతిఁ
వెలువడ జేయ, ఆంధ్ర పృధివీ పతి రచ్చ ముగించె; అంత, బె
ద్దలు వినిపించి నట్టి ఫలదాయకమౌ ఒక నాడు; దైవ పూ
జలు అభిషేకముల్ నతులు జల్పి సమి ద్ధమ నాభి లాషియై.

పడవాండ్రలో బెద్దవాడైన కామనా
యకునకు గొంత సైన్యం బొసంగి
అతనికి వెనువెంట త్ర్యంబక దా నను
వానికి ఒ క్కింత బలగ మిచ్చి
అతని వెనుక తిమ్మప్ప నాయకు డను
సేనానికిన్ గొంత సేన బనిచి
అతనికిఁ దరువాత అలరు నాదెప్ప నా
యకునకు ఒ క్కింత అంగ వుంచి

అంత, గొండమరెడ్డికి గొంత; పిదప,
నగర పాలుడు గోవిందునకు ఒకింత;
ఆ వెనుక, మామ శ్యామరాయులకు గొంత;
బలము సమకూర్చి ఆంధ్ర భూపాల మౌళి.

పదపడి, ఇంకను బలములు
పదిలమ్ముగ బంచి సైన్యపతులకు ఇడి ఆ
పిదప, శరీరపు రక్షణ

తాన, రారాజు సర్వ సేనానియు నయి
ఆంధ్ర ఖడ్గ ధారలో —
మహాంధ్ర పౌరుషమ్ము మెరయ;
విక్రమించి రాయచూరి
విపుల యుద్ధ రంగ మందు;

అరుల బీల్చి పిప్పి చేసి
అలరి విజయ లక్ష్మి జెందిి
ఆంధ్ర దేశ కీర్తి నిలుప రా!
సహోదరా! నడువర!

కటక పురిని గాల్చి
ఓఢ్ర కాంతు వశుని జేయు నప్డు;
కొండవీటి రిపుల దునిమి
కొరలి విజయ మందు వేళ;
దాక్షిణాత్య పతుల వెంట
తరిమి తరిమి గెలుచు నాడు;

కదన భూమి బెగ్గ డిల్లి
కంప మొంద జూపి నట్టి;
ఆత్మ దేశ భక్తి జూప రా!
సహోదరా! నడువర!

అని, సమి ద్గీతముం బాడు చశ్వ మెక్కి
దళము లన్నియు దన వెంట దరలి నడువ
వెడలె రాచూరి వైపున కు; డరి అలరి.

దారి పొడుగున రోదసీ ధామ మెల్ల
విరిగి పడు నట్లు లల రణ భేరి మ్రోగు
చుండ, జని చని మల్లయ్య బండ వద్ద
విడిసె సేనల తోడ; బృ ధ్వీశమౌళి.

రాయ చూరున కనతి దూరస్థ మైన
గ్రామ మది; అంత, నచట రారాజు దైవ
పూజ నాదిక మంతయు బూర్తి చేసి
కొన, బురోహితు డరుదెంచె; ఘను డొకండు.

వచ్చి రారాజు జూచి; దేవా! అరాతి
నెదిరి పోరాడుటకు ఇది యెంతో మంచి
సమయ మని యెగ; సక లాంధ్ర సార్వభౌము
డ, డరి ఆజ్ఞలు కోట ముట్టడికి అనిపె.

అనిపిన ఆజ్ఞలన్ శిరములందు గ్రహించి సమస్త భార తా
వని బలవంతమైన, అల ప్రాకట దుర్గము, రాయ చూరి కో
టను, వడి ముట్టడించెను పటాలము; లంతట, బెద్ద పోరు రే
[illegible] రణ భీకర [illegible] నాదముల్.

దశలక్షా పటుసైన్యమున్ గొని మహాంధ్ర క్ష్మాతలేంద్రుండు, నీ
వశ మందుం గల రాయచూ ర్నగర సర్వస్వమ్ము బంధించె; దు
ర్దశ పా లైరి తురుష్క సైనికులు; ధైర్యంబెల్ల గోల్పోయి, రో
శశి రేఖా ధ్వజ పాల కాగ్రణి! చమూ సంఘాధి పాగ్రేసరుల్,

అనుచు అగచాట్లు దెల్పు వీక్షణాల, మిపుల
వెలవెలం బారు మోముల, బిక్కు బిక్కు
మనెడు గుండెల, తడుబడు నట్టి నుడుల
విన్నవించిరి చారులు; విభున, కపుడు.

విని, ఆ బీజపు రావనీ పతి మనో వీధిన్ బ్రసంగించి; ర
చ్చను గల్పించి; ప్రభుత్వ ముఖ్యులను బ్రస్తావించి; వె న్వెంటనే
తన సైన్యంబుల నెల్ల గూర్చుకొని; ఆంధ్ర క్ష్మా పతిన్ ధాక వ
చ్చెను, కృష్ణోత్తర తీర భూమికి; మహాసి త్వి ణ్ణినా దార్భటిన్.

వచ్చిన వాని హృద్గమన పద్ధతి చూడ దలంచి, ఆంధ్ర రా
జచ్చటనే రహించె; అత డా కిటుకున్ గ్రహియింప లేక, నా
వచ్చిన వార్త ఆంధ్ర నర పాలునకున్ విశదంబె? ఐన, దా
నిచ్చటి కేల నన్ను ఎదిరింపగరా; డని, కొల్వునం దనన్.

బల పరాక్రమ వంతుడ వైన నీకు
జడిసి రాలేక అచటనే అడగి యుండె
అతి, డని కొంద రనిరి; కా దనచు వెంట

అమిత శ్రీ గల రాజరాజతనుడు; నిన్నానంతయుఁ లెక్క సే
యమియే హేతువు రాకపోవుటకు, రాజా! అంతియే కాని, వి
క్రమ సంపత్తికి జంకి; దట్టనుట, మూర్ఖత్వంబ; నిర్నిద్ర వి
క్రమమున్ గల్గిన రాజులే, అతని శౌర్యాక్రాంతులైరెందరో.

అని వచియింపగా, విని; నిజాత్మ నా కంచుక పర్యటించి; కృ
ష్ణను, సచమూ గణుండయి ప్రశాంతముగా దరియించి;కృష్ణా
యని వసతి ప్రదేశమున కా, వల దొమ్మిది మైళ్ళ దూర మం
దున, విడిసెఁ; త్రిలింగజన ఘూర్వాహుడంతట, ఆయుదంతముఁ.

విని, యొక కొంత సేన తన వెంబడి రా; నగి సద్దగింపగఁ.
మునుకొని, యేగి యేగి రిపుభూపతి సీమకు, మూడు మైళ్ల ద
వ్వున, ఒక వాసయోగ్యమగు భూమి మకా మొనరించె;నింటిపై
కెనసి రటించు సాధ్వస పరిస్ఫూర్తి నమిష్టన వాద్య ఘోషలఁ.

శుభ దివసాది నంత్య, రణ శూరత మోహముల దాండవింపగా,
ఉభయ బలంబులున్ గదిసె నుద్ధతి; విస్మృట, యుద్ధ భీకరో
ద్రభసత హద్దు మీరె; వసు ధాంబరముల్ సకలాని ఘోషణ
ప్రభల సపూర్వ రమ్యతి వెలార్చె గనం గల ధైర్యశాలికిన్.

అట, జయాపజయంబుల సరయు గలుగు
వాడు, భగవంతుడే; కాని, శ్రీ దొరకందు
అన్యు; డా విధి సోంత మతిశయింప;
గొంతవడి, కాంధ్ర సేనల యంతి ధమున.

అరుల ఫిరంగి దెబ్బల మహాచలనం బుదయింప; అందు, గొం
దరు పరతెంచ సాగి; రది, ధాత్రిపు డారసి వ్రేలి నున్న ఉం
గరమును దీసి వెంటనె ఒకానొక రౌతున కిచ్చి: నీవు నా
మరణమె సంభవించిన, అమాంతముగా జని రాణి వాసమున్.

చొచ్చి నా చావు గురుతుగా జూపి దీని;
సంప్ర దాయాను గుణముగ, సహ గమనము
చేయ వలసినదని చెప్ప వోయి, నాదు
మాటలుగ, రాణులకు; మరు మాట లనక.

ఉరవడి నిట్లు పల్కి ప్రధనోర్వి జలించెడు సేన గాంచుచుగా
వరుసగ మూడు రాష్ట్రముల పార్థివు డా అల ఓఢ్ర రాజుతో
జరిపిన ఆజి, నున్న అల సత్వ పరాక్రమ శక్తు లిప్పు డే
దరి కరిగెగా? దెనుంగు ప్రధ దగ్గ మొనర్తురె? తెన్గు పుత్రకుల్.

శై లోదార బలాఢ్యు నాంధ్ర ధరణీశ గ్రామణిన్, యుద్ధమం
దోడింపం దగి దేశ దేశముల ఎంతో గీ ర్తి గై కొంటి: నం
చేడిల్ షా గరివించి ఉబ్బు దివసం బే తెంచెనా, ఏమి? క
ట్టా! లా వెల్ల నశించెనా? అయిన, గారా? మీర, లాంధ్ర ప్రజల్.

ధైర్య మెల్ల గోలుపుచ్చి
తల్లడిల్లి తొలగు వారు
రాజు గారి ద్రోహు లౌదు;

నీతి జాతి లేని వారు
లనేకు లుండి ఉంట కంటె,
నికర మైన దేశ భక్తి
నగడు శూరుడొకడ చాలు;

ఎట్టి యుద్ధ మందునైన
ఇట్టె విజయ మంద వచ్చు;

జుట్టి బట్టి ఈడ్చి తన్ని
కొట్టి నెట్టి నరకి రండు,
అజ్ఞ బారు పిరికిపంద
లందరిన్ దయార్ద్ర దొలంగి;
వెనుక ముందు లాడ వలదు
వెడలి రండు; సేన లార!

అని, తన చుట్టు నున్న బల మంతకు ఆజ్ఞ నొసంగి; తాను, చ
క్కని తురగమ్ము నెక్కి; ఒడికంబగు శూరత నాజి మధ్యమున
జని; బహువిధ నోద్విహారములు సల్పుచు నుండగ; నెన్ను జూసి వా
రు, నల బలంబు లన్నియు అరుంతుద శౌర్యము ముమ్మరింపగన్.

అదుగో, గండర గండడౌ మన మహీ శాగ్రేసరుం; డిప్పుడు
జ్వాలుడై పోరుస జొచ్చి తాన కదన వ్యాపారతన్ బేర్చి శ
తృలిల బోకార్చుచు నుండె; రండిక, సమిద్రోషమ్ము తీండ్రింప అ
య్యోడకుండ బోదము; రాజరాజునకు ఎంతే స్వాదుమందింపగన్.

మరియు, నిటువంటి ఛండాల మరణ మునకు
గురి యగుట కంటె, అని రిపు కోటి నడచి
వీర మృతి నందినన్ మేలు; పిదప, నాజి
ప్రభువు బాయుట; తీరని పాతకమ్ము.

ఈ విధి, వానిలో నవి గతించిన దానికి నొచ్చుకొంచు భూ
మీావరు జేరి పోరి తమమేయముగా నొనరించి శాత్రవ
శ్రీ వణకన్ రిపుప్రజ మసిం బొనరించి జయమ్ము తెచ్చి ఆ
త్మావని కిచ్చె; ఆంధ్ర వసు ధా పతి హర్షము మేర మీరగన్.

ఏడిలుఖాను డంత, బొనరించుట కేమియు లేక; నాడు తా
నోడిన దానికిన్ గడు మనో వివశత్వము నొంది కుందుచున్
బోడిమి మాలి తత్ప్రధన భూమి బలాయితు డయ్యె, సర్వమున్
వీడిచి; దిక్కు లేక, బహు వీరులు మున్నగు వార లంతటన్.

పొసగిరి కృష్ణరాయలకు బూర్తిగ బంధితులై; అమూల్య వ
స్తు సముద యంబునున్ దొరికె దోరముగా; నటులయ్యు, నత్ప్రధా
భ్యసనుడు గాన, స్త్రీల బసి పాపల బూర్తిగ వీటిబుచ్చి మం
చి సరసు డాంధ్రరా జని పచేళిమ కీర్తి గడించె; ఉర్వరన్.

కలిగిన ఆ మహా విజయ గర్వ ప్రహర్షములన్, దెలుంగు సే
నలు తునుమాడ ఆయుధ గణంబులు లేమి, శరీర రక్షణన్
జలుపు కొనంగ బారు ప్రతి సైన్యములన్ బరిమార్చు చుండ; రా
జులు కని: తప్పు తప్పు వల; దంచు, రయంబున ఆజ్ఞ లంపినన్.

అవనిప! శత్రు శేషము రవంతయు నుంచగ రా దటంచు, సై
న్యవిభులు వచ్చి వేడ; వసుధాధిపు చెంగట నున్న వార లం
దెవ రెది చేసినన్ నృపుని దే యగు నయ్యది తప్పొ ఒప్పొ; నా
ప్రవిమల కీర్తి కా పని అపథ్యము; కావున, మాను డింతటన్.

అంతియే కాక, కదనంబునందు మనకు
ఎవడు శాత్రవుడో యాత డేడిలుపతి
పరచియే యుండె; ఇక, పరిసంధి ఎవరు?
వీర లన్ననో, పాల్యు; లే విభుని కైన.

అని, ఋజు మార్గ వర్తియు, మహా కరుణా హృదయుండు నైన, అ
య్యనిమిష రాజ తుల్యుడు మహాంధ్ర నృపాలుడు నొక్కి చెప్పినన్
విని, అల సైన్య పాలకులు వీగడి సేతలు మాని యేగి; రా
వెనుక, ద్విష త్పటీయు గృహ విశ్వమునన్ విహరించి పిమ్మటన్.
పొంపిరి వోయి యుద్ధమున బోయిన వీరులకున్ శిఖి క్రియల్
పెంపెన లార జల్పి నిరు పేదలకుం గడు దాన ధర్మముల్
తెంపరియై పొనర్చి మొయిదీన బ్రహర్షపు చిహ్నముల్ పురా
ణింప, ససైన్యుడై మరలె; ఇంతకు ముందటి వాస సీమకున్.

భామినీరాజ్య పాలక పంచకమున
గడు బలోద్రేకు డేడిలుఖాను; డతడు
పోర జితు డయి వీగె; రాచూరె ఇంక

ఘుసుపటి కోట ముట్టడి, అమోఘముగా ఉరణించి దట్టమై
పెనుపు వహించె; ఆజియును, పెద్దదియై పొలసాడె; అంతలో
ఘనమతి పోర్చుగీసు మహికాంతుని దూత ఒకండు, రాజకీ
యు నిపుణు, డేగుదెంచి వసుధాధిపునిన్ గలిసెన్; స్వసైన్యుడై.

పరమ సమర్థుడా అతని బాసట, బోరిత మంత కంటెనున్
విరివిగ సాగె; శత్రులును బేర్చిన యుద్ధతి నిల్వరించి, రం
దరు నొకమై; మహోగ్రతను, దాల్చె సమీరణ మొక్కింత సేపు; భీ
కర రణ యంత్ర శబ్దములు క్రిమ్ము కొనెన్; వియదుర్వరాదులన్.

పదపడి, రాయచూర్నగర పాలుడు పోరిత మాడు చుండగా
జదిసి ధరన్ బడెన్; బొలిచె సైన్యము నందున దొట్రుపాటు; అ
య్యది కని తత్పురీ ప్రముఖు లందరు, శ్వేత పతాక లెత్తి భూ
పు దరియ వచ్చు చుండ; అది భూపతి కాంచి దయార్ద్రచిత్తుడై

అనుపదమె, ఆజ్ఞ లంపించి ఆల మాపి
తిమ్మరుసు మంత్రివరు నామతించి; హృదయ
సదన మందలి కరుణా రసమ్ము చిమ్మ
అవయవమ్ముల నంతట నలము కొనగ.

ఎదురుగ నేగి దిక్కు చెడి ఎంతయు గుంది కృశించి ప్రాణ సం
పద కభయమ్ము గోర మనవద్దకు వచ్చెడు ఆ మహా ప్రజన్
గదిసి సమాదృతిం జలిపి [illegible]

౫౭: భయమ్ము నొందకు డొకింతయు; మీరాయి చక్రవర్తి ఎం
తో గరు ణార్ద్ర చిత్తుడయి ఉండెను పరిస్ఫుటమ్; నంచు, వారలన్
బాగుగ నూరడించి జనపాలుని సన్నకు దోడి తెచ్చె, ను
శ్రీ గల తిమ్మరా ట్సచివ శేఖరుడు; దొప్పిన గౌరవంబునన్.

వచ్చిన వార లందరు, నృపాలుని ముంగట, భక్తి నమ్రతల్
విచ్చగ, దండముల్ సలిపి, సల్లిదమై, కను దోయి నుష్ణ బా
ష్పోచ్చయబిందువుల్ తొలుక: ఉత్తమనాయక! కావు; మెంతయున్
నొచ్చిన కాందిశీకుల- మనూన దయానిధి; నంచు, వేడినన్.

ఉరక, అధైర్య మూని వెతనొందకు; డాత్మ భయాన కోర్ధతిన్.
దెరలుప జేయు; డంతయు, గతించిన; దింక, భయమ్ము లేదు; ని
బ్బరముగ నెగుదెంచుడు; శుభం బగు; మీమును, రేవ వత్తు మం
దరము పురంబులోని; కని, ధాత్రిపు డాదృతి బల్కె; బిమ్మటన్.

పరిమితి లేని హర్షపు ప్రభల్ కను చూపుల లాస్య మాడ, ద
త్పుర జను లందరున్ దిరిగి పోయిరి; పోయి: మహాంధ్ర ధారుణీ
శ్వరునకు స్వాగతం బను సువర్ణపు టక్షర భాసి పత్రముల్
పుర ముఖ మార్గ శీర్షముల బొల్పుగ ఉంచిరి; ఉంచి, పేర్మిమై.

లలిత సుమాల మాలలు కురంగటి మంగళ వాద్య ఘోషలన్
కలిసి పరిమళమ్ము పలు కైపుల నల్గడ నింపు చుండ; భూ
తలపుని రాకకై హృదయ ధామము లం దసియాడు నెమ్మి, ను

ఉదయమున లేచి; కాల్యంబు లోలి దీర్చి;
సాంధ్యా వందన మాదిగా, జనెడు నిత్య
కర్మ లన్నియు, నోపిక గడపి; వెంట,
సైన్య పాలురు పలువురు సాగి నడువ.

తరలి పురమ్ము జొచ్చిన; బ్రధ్గ్నిత సర్వమనో విచారు లై
కర మనురక్తి రాజున కఖండపు స్వాగత మిచ్చి, రా పురీ
వరజను; లంతటన్, బ్రభువు వారల యందు బ్రసన్న చిత్తుడై
పురి గల పెద్దలం బిలిచి పొల్పు వెలార్చు తెలుంగు పల్కులన్.

మునుపటి యట్ల, మీరు పరిపూర్ణ మనఃస్థిమితంబు నొంది ఉం
డిన, ఇట ఉండవచ్చు బురడింపుచు, దోహద ముండునేని; లే
దనిన, సమస్తముం గొనుచు, ఆత్మల కింపగునట్టి వేరు తా
వున కెట కేని బోవు నెడ, బోవగ వచ్చు; హృదిష్టపద్ధతిన్.

అని నిగదింపగా, నగర మందలి ఆ మహనీయు లందరున్
దెనుగు మహీంద్ర శేఖరు నుదీర్ణ మనస్సున కుల్లసిల్లి; ఓ
అనితర రాజతుల్యా! ప్రజ నాదట జూచెడు నిన్ను వంటి, భూ
వుని పరిపాలనన్ విడిచి పో జనునే? మతి గల్గు వారికిన్.

అని, నయగారమున్, వినయ, మాదట, పేరిమి, బత్తి, నమ్మకం
బును, ఒకమారుగా బయలువోవు వచస్సులు వెల్వరింపగా
జనపతి సంతసించి; తన సైన్యము నం దొక కొంత భాగ మా
మునతర దుర రక్షణకు గా నట నుంచి; అనంతరంబునన్.

తరచుగ, నీతి లేని వసుధాధిపు సైన్యములన్ జనించు అ
ల్లరులు, స్వకీయ సైనిక కులంబులలో దలయెత్తకుండ, ఉ
త్తరువు లొసర్చె; అప్పటికి, తప్పు యొకనియు గానిపించినన్
దిరిగి రహింప కుండ, అతి తీక్ష్ణముగా బొసరించె; శిక్షలన్.

ప్రధన వశమున గలిగిన పట్టణంపు
ప్రబల నష్టంబు లన్నియు బాగు పరచి;
నగర పాలనకున్ దగు నట్టి పనులు
మలసి జరిపించె; ఆంధ్ర సామ్రాట్టు నాడు.

పెక్కువ లెక్కసేయ దగు బీజపురీ పతి పాటు గాంచి; ఆ
తక్కటి మహ్మదీయ వసు ధాధిపు లందరు: నాటి ఆంధ్ర భూ
భుక్కు, స్వపాలితంబు లగుభూములుగూడ జయించునేమొ, అం
చెక్కుడు భీతి నొంది; తమ కేమియు హాని ఘటింప కుండగన్.

తమరు, బీజపు రాధీశ్వరుని వద్దనుండి కైకొనిన ఆస్తి
గ్రమ్మర, అతని కిప్పించి దయ జూప, బ్రార్థితులు.
ఇక, జిగీష వీడిచి ఇందనుక జయించిన రాజ్యములతో
దనివొంది యుందురని; విశ్వాసము. అట్లొనర్తు రేని,
తమ వాల్లభ్యమున; కెల్ల కాలము, భృత్యులమై
యుందుము. కాదేని, ఏదిల్ షాతో నేకీభవించి మే మం

ఇట్లు, లేఖలు బాగుగ ఎంచి వ్రాసి
రాయబారుల కిచ్చి రారాజు కడకు
బనిచి; రంతట, వారును బయలుదేరి
వచ్చి; రాంధ్రావనీంద్రుని వసతి కప్పుడు.

వచ్చి, తెలుంగు నాయకుని వైభవమున్ బలమున్ బరాక్రమం
బచ్చుపడంగ జూచి, హృదయంబుల నచ్చెరువొంది, వారు; వా
రిచ్చిన లేఖలన్ నృపున కిచ్చిరి; ఇచ్చిన, చక్రవర్తియున్
విచ్చి సమీక్ష సేసి వెను వెంటనె, ఏచిన వాగ్గభీరతన్.

ప్రస్తుతము, తా మెల్లరు మాకు హితోపదేష్టలైనం
దుకు; వందనములు. బీజపురీపతి పట్ల బాలించిన మా
ప్రవర్తనకు; ఆత డెంతయు, అర్హుడు. అతని నోడించి
పరిగ్రహించిన తద్ద్రవ్యమును; మగుడ, ఆతనికి బ్రసా
దించుటకు గారణ మగపడదు. నిర్హేతుక కృత్యము
లొనర్చుట; ఆంధ్ర సార్వభౌములకు, అనిష్టము.
తాము, బీజపురీపతితో గలిసి; శ్రమించి; మా నెలవు
నకు రా నవసర ముండదు. తాలిమి గలిగి, సెలవొసం
గిన; మేమే, మీ సన్నిధికి రా నున్నాము.

అనుచు, జవాబు లేఖలు తయారొనరించి ఒసంగి వారలన్
బనిచె ఉపాయనంబు లిడి; వారును, రేని మహాశయమ్ము నె
మ్మనముల నెంచుచుం జనిరి; [illegible] డంతట, రాజధానికిన్

చని, యొనరించె ఎంతయు శ్ర[illegible] భ[illegible] నతఁడు దేవ పూ
జనములు; ఉత్సవంబులను; [illegible] సంతతిస
దనియగ జేసె; బాలలును, [illegible] ప్రతుష్టి
ఘనముగ విందులన [illegible] ఆ మహా పురిని

అంత, నూతన నిర్మితం [illegible] నాగ
లాపురంబున కేగి; రా[illegible]
ముగ దినంబులు అరుగ్యాడ, [illegible]
వచ్చె ఒక దూత, వడిలు [illegible]

వచ్చిన రాయబారికి, నృపాలుడు [illegible] దర్శనం
బిచ్చెను కొన్ని రోజులు గతించిన [illegible]; ఈత డెందుకై
వచ్చెనో యంచు లోన పలు [illegible] సందియము, ఎంచి: ఇంక నీ
వచ్చిన కార్యముఁ దెలుప వచ్చు, నటంచు పసంగ; ఆనతిన్.

ఆపయి, రాయబారి నను [illegible] జూచుచు: రాజరాజ! మా
భూపతి, ఆజి మీరు కొని పోయెను [illegible] సంబులన్; దయన్
జూపి యొసంగి కాపు మనుచున్ మిము వేడగ, నన్ను బంపె; దా
మీ పని కియ్యకొన్న, అత[illegible] మీకు; విధేయుఁడై చనున్.

తాతల నాటి నుండియు, అతండు సుమిత్రుడు మీకు; అట్టి భూ
నేతను, మీర లి ట్లురవణించి రిపుం బలె నెంచి నేడు సం
ఘాతము లిచ్చి పుచ్చుటకు గన్పడ, దాత్మ ఎటుల్ దలంచినన్

జరిగిన దేదియో, జరిగె; జా గొనరింపక, ఇంక, అస్మన్మహీ
శ్వరుని అనుగ్రహింపగదె; భక్తుడు మీ కత డెంతయున్ నిరం
తర; మటు పోహణించి జనతా స్తుతులందుల దూగు; మీ వసుం
ధర గల రాజ లోకమున, దద్దయు మేటివి నీవు; భూపతీ!

అని విశదీకరింపగ, మహాంధ్ర మహీపతి, ఆలకించి: ఆ
తని కపటమ్ము ఆతని గతాస్థ నొనర్చిన; దంతె కాని, మే
మొనరిచి నట్టి దేదియును, ఉండదు నా; డయినన్, క్షమింతుమీ
వనిన విధాన; కావు మని ఆతడు వచ్చి పదంబు లానినన్.

అన, నది ఏడ గావలయు ఆనతి ఇం డని రాయబారి కో
రిన, ముదిగల్లు వద్ద నని రేడు వచించ; అతండు, మంచి దం
చ న, బయనంబు గట్టె వసుధాధిపు డయ్యెడ; కంత, బీజపూ
ర్జనపతి రామికిన్, హృదయ సాధములన్ విహరించి ఉగ్రుడై.

క్ష్మాలోకంబున, సాటిలేని దశ లక్షా సైన్య సంప త్ప్రభా
లోలుం డైన మహాంధ్ర నాయకుని; ఆలోకింపగా శక్యమే
ఆలంబందున ఏరికైన? ధరణీంద్రా! అట్టి సన్న్ని, నలన్
గీలింపన్ దొరకొంటి; వెంతటిదగా! కీ డెంచి మెలంచవో.

అని, త దావాస నగరికి అతని వెతకి
బంధితుం జేసి ఆత్మ నివాసమునకు
బట్టుకొని రా బలంబుల బంపె; నవియు,

ఇదివరకే, తెలుంగు ధరణీశ్వరు ఘాటిని మచ్చు జూచుటన్
మది భయ మంది ఆ దొర అమాంతముగా అటనుండి పారిపో
యె; ద దితివృత్త మాగని మహీశ్వరు సైన్యము, లందు ఆతనికై
వెదకియు, గానమిన్ సరిసు బీజాపురిన్; చెలరేగి అంతటన్.

కొనకొని సైన్య మట్లు పురి గూల్చి గమించిన జాడగాంచి, ఆ
మనుజ విభుండు వచ్చె దన మన్కికి గ్రమ్మరి; వచ్చి అంతయుం
గని మది సంగరార్హ్యను: ప్రగాఢ పరాక్రము డాంధ్ర రాజుతో
అనవసరమ్ముగా జగడ మంటితి; నంచు, అనేక భంగులన్.

అంత, శ్రీకృష్ణ దేవరాయలు ససైన్య
ముగ బ్రవేశించె ఆత్మీయ నగరి; గదన
ములును, ముగిసెను; వ్రాసె, ఆముక్త మాల్య
దను; గమించెను రోజు; లానంద నిధి దేలమి.

# చంచలశ్రీ

పరుల జయించితిన్; తెలుగు బాస ప్రధానము గాఁగ, భారతో
త్కృత గల, దక్షిణా పథ నృపత్వ రమా విభవంబు నంతయున్
విరియని బంటునై, అనుభ వించితి; వృద్ధుడనైతి నే; డికన్
జరిగిన రోజు లందు బలె, సాగదు తెందనము; లోక వాంఛలన్.

అని, ఒక నాడు రాజు హృదయమ్మున బర్యటనంబొనర్చి పు
త్రునకు ప్రభుత్వ మిచ్చి ముదితుం డయి పూర్తిగ విశ్రమించె; ఆ
వెనుక, నవీన రాజు పృథివీశుల మేలుచు నుండ ఒక్క రో
జున అది యేమొ! రోగ పరి శోధితు డై పొలిసెన్; విధిక్రియన్

సత్యమో, కాదో, "తిమ్మ నామాత్యు కొడుకు
విస మొసంగెను, నూత్న పృథ్వీశ మౌళి;
కి" ను ప్రచారమ్ము సర్వత్ర సలుపు కొనుచు,
వచ్చె, మెల్లగ; ముసలి భూపాలు కడకు.

అది సత్యం బని నమ్మి, ఒక్కయెడ
పుత్రా శ్వాంత శోకా కుల
వ్యథ, వే రొక్కట మంత్రి శేఖర
సుతా త్యాచార కోపమ్ము, నె
మ్మది సాంతంబుగ వేల్చుచుండగ;
మహామాత్యున్ దదాస్థానమున్
గదియన్ రా, గబురంపె సాత్మజునిగన్;
క్ష్మాపాలు డత్యుగ్రుడై.

నరపతియానతిఁ జిరమునందు వహించి సప్రశ్రయుఁడై సభాం
తరమున వచ్చి నిల్చెను స్వాతంత్ర్య పతాకం; డటు నిల్చి సభ్యు లె
ల్లరు ప్రకటించు నాటి విరళ ప్రతి పత్తుల చిన్నవోయి, అం
దరు నిట నిట్టి వైఖరులు, దాల్చుటకున్ గత మేమియుండునో!.

అని, పొలివోని పట్టుదల నాత్మ ననేక విధాల చింతలఁ
బెనగుచు నుండగా; నృపతిసింహుడు, కన్నుల నెఱ్ఱఁ జేసి: నా
తనయుని, అవ్వళించి విగతాసుని జేయుట, కేమి హేతువో
విన దమకించు చుంటిమి; వివేకిని నీవు, వచింపు; మంతయుఁ.

అని పగదించె; ఆనిగద, మా తని యాత్మకు వజ్రపాతమై
కనబడె; అంత, గోలుకొని: ధర్మావర! ఎన్నడు లేని ఈ ప్రవ
ర్తన, తమ యందు నేడు మసలఁ గతమేమియో; కాని, చూడగా
అనితర సన్నిభం బయిన, అచ్చెరువయ్యెడు నాకు; ఎంతయుఁ.

మతిగల వాడవై, భరతమాతకు బుట్టి, సమస్త శాస్త్ర సం
గతి దగు సత్య హరిశ్చంద్రుడవుగా యశ మంది, అశేష రాజ్య బా
ధ్యతను వహించు నీవె, యిటు లాత్రము నొందిన; రాజరాజ! ఏ
మతియును లేని అన్యులగు ధర్మావరులు; లెట్లు చరింతురో కదా!

అని యీ వైశ్యుని, మంత్రిశేఖరు డుపన్యాసమ్ము గావింపగా;
జనపాలుం, డతి రోష చిత్తు డయి: రాజద్రోహముం జేసి ఇం
కను, ఏమేమొ ఉపన్యసించెదవు, లోకంబుఁ విడంబింప; నీ
గుణ మీనాటికి స్పష్ట మైనది; మహాక్రూరుండవీ;వెమ్మెయిన్.

అనిన, విని మంత్రిశేఖరు: డసలు, చెడుగు
కాల మరుదెంచి నప్పు డ; కారణముగ,
మంచి వారలు, క్రూరుల మాడ్కి గాని
పింతు, రెవ్వారి కైన; మహీతలేంద్ర!

పొరపడుచుంటి వీ విపుడు, భూవర! ఎవ్వరు చెప్పి పెట్టిరో
మరలని యట్టి ఈ చెడుగు మాటలు; మానవు వీని, ఎంత ము
మ్మరముగ నమ్మ బల్కినను; మచ్చరమే ఒకవేళ నాకు నిన్
గురిచి రహించు నేని, ఇల గూర్తునె నీకు? గ్రహింప, వక్కటా!

అనిన, సహింపశక్య మవనట్టి ప్రమాద మొనర్చి ఏమియున్
బొనరుప నట్టివాని వలె బొల్చుచు నీ దరి నిల్చి యున్న, నీ
తనయుని గూకలింపక; వితండ వివాదములం బొనర్పగా
మన సెటు లొప్పునో కద; అమాత్య కులాగ్రణి! నేడు నీకిటన్.

అన్న మ దీక్షణంబులు బయల్పడ బీకి స్వకీయ పుత్రు రా
జోన్నతి నిల్పగా, దమకు ఉత్తరు విచ్చిన యప్పు; డీర లా
సన్నుతు పట్ల జూపిన, అసహ్య ప్రవర్తనయే వచించు, నీ
కన్న మరొక్క వంచకుడు కన్పడ డన్య; డటంచు, ధీవరా!

అపుడు, నీ వాతనికి ద్రోహి వైతి వట్లు;
ఇపుడు, నీ పుత్రు డయ్యె మా కిట్లు ద్రోహి;
ఇరువురును, ద్రోహులే యాదు, రెంచి చూడ;

యువరా జొక్కఁడు, పోయినంతనె; నమ స్తోర్వీ ప్రభుత్వమ్ము నీ
కవునా? సర్వ ప్రతీప భీకరుఁడవు, లేడా? కృష్ణరాజేంద్రుఁ డీ
అవనిన్; జిన్నతనంబునుండియును, ని న్నత్యంత ప్రేమమ్ముమై
అవలోకించినదానికా, ఇది? మహాత్మా! మంత్రిలోకేశ్వరా!

ఈ విధి, వృద్ధరాజు నిగదించిన పల్కుల రోస మంది; ఏ
మో వచియింప బోవు, జనకో త్తము గ్రక్కున అడ్డగించి; ధై
ర్యానహ చిత్తుఁడై, అతని ఆత్మజుఁ డయ్యెడ, రాజుగాంచి: ఓ
భూవర! చాలు నింక, గడు బుద్ధి గలాడవు దూర దృష్టియున్.

చెప్పెదు మాట లాత్మ బరిశీలన సేయక, సంభ్రమించి, ఎ
ల్లప్పుడు మీరు శ్రేయమున కాత్మ బయల్పడ పాటుపడ్డ, మా
అప్పను; ఇట్టు లీ ప్రభువు లందరి ముంగట ఆడిపోసె దీ
నిప్పుడు; ధర్మమా ఇది? మహీశ్వర! నీ యటువంటి వానికిన్.

చిన్నతనంబునుండియు, అశేషపు ప్రేమ రసమ్ము చిప్పిలన్
గన్న కుమారుకంటె, అధికంబుగ జూచుచు; ఈ యనంత రా
జ్యోన్నతి గంతకున్, నిను బ్రభుత్వము జేసిన ఈ మహామహున్
మన్నన దక్కి నల్గురి సమక్షమునం దిటు చూడ, బాడియే?

వెనుక, త్వదీయ సోదరుని భీతులనుండి తొలంగజేసి ని
న్నొనరగ మంచివాడ వని ఉర్వికి నేలిక జేసినందుకా?
జనకుడు ద్రోహి యౌట; నృపచంద్రమ! కాటికిగాళ్ళుజాపియున్
ఘనతర మైన పాప పరిఘమ్మునకున్ గమియించె దేలొకో!

అవలోకింపవుకాని, ఈ యువని నథ్యక్షించు ఉద్దేశమే
అవనీనాయక! అప్పు కున్నయెడ, దా నానాడె కై సేయు; ఈ
యువరాజున్ బొలివుచ్చ నేల? యిపు డీ వూహింప లేకున్న, ఈ
నివహంబైన, గ్రహింపదా? ఇతని వాణీ శీల పూజ్యార్థముల్.

చిరుతతనంబునుండి, కడు జెల్మి దలిర్పగ జూచినందుకున్
సరిగ సమీక్ష సేసిన, విశాంపతి! మోసము నీకు మంత్రియే
జరిపెనొ; నీవె ఆతనికి జల్పితివో; ఇపు డీ మహాసభాం
తరులయినన్ గ్రహింపరె? ఎదగ జెడి నీవు గ్రహింప కుండినన్.

అనిన, గుమారభూపతి తనంతగ దా దెగటారెనో; అమా
త్యుని తనయుం డితండె, నిగతుం బొనరించెనొ; అంచు, దత్సభా
జనము తలంచు చుండగ, బ్రచండ రుషా కలితాంత రంగుడై
జనపతి, వారి చేతులకు సంకెలలం దగిలించె; దిగ్గనన్.

అది పరికించి, ఆ సభికు లందరు అచ్చెరు వొందిః మాటలన్
విదిత మొనర్ప రాని పదవీ విభవంబున; ఇంతదాక, అ
త్యధికముగా రహించిన ప్రధాని దశాగతి ఎట్లు మారెనో
కద! యనుచున్, విశాకు పడగా;సచివాత్మజుడుగ్ర మూర్తియై

మనుజవరేణ్యా! ఈ దురవమానముతో, దని వొందకుండ; ఇం
కను, మము జిక్కులన్ జొనుపగా గమకించెద; వట్టులైన, నీ
మనమున రేగియున్న అనుమాన మనోవ్యథ, ఒక్క నా పయిన్
గనుక; పితన్ త్యజించి ఎట కంపెద వో, నను బంపు; మీక్రియన్.

అనిన, "అనుమాన మొక్క నీ యందె కాదు;
కలదు, నీ తండ్రి యందును; కనుక, మీర
లిరువురును శిక్షణీయు లంతేని ఇప్పు"
డనుచు వాదించె, అతఁ డా సభాంత నమున.

ఎంత దారుణ మయ్యె! నీయంత వాని,
ఇట్లు యోజింప కుండ, శిక్షించె; దకట!
నవన వోన్మేషితమ్ము మనమ్ము నీది;
అట్టి దీనాడు పాషాణ మ్మున; దేమొ!

కన్నెత్తి చూడ శక్యము కాని యట్టి ఉ
త్కలరాజు జతు జేయ గలిగె నీకు
పూర్వాలం దేరికి పొంద జాలని రాయ
చూరి నిగ్రహ విధి జూపె నీకు
ఎల్లప్పుడుః విక్రమించెడు భామినీ
నృపతుల చేత మ్రొక్కించె నీకు
నీ యంత వాడు లేనేలేడు లోకాన
అను కీర్తి గలిగింప దనరె నీకు

ఇతడు; సామాన్యుడే? మంత్రి వృషభు; డట్టి
వాని, విశ్వాస ద్రోహిగా ప్రభువరేణ్య!
ఇట్లు లవమాన పరచి శిక్షించు చుంటి
విపుడు; లే ద్రోహి ! సాహసు [illegible]

అని, దళవాయి యైన సుతుఁడా, త్మ గలంగి ఉపన్యసింపగా:
దనయ! అనంతమైన వసుధాతల మేలెడు చక్రవర్తి ఈ
ఘను; డదెకాక, సత్కవి; అఖండ విశారదు; డీత డింకనుఁ
దనరిన, రాజ్య మెల్ల బహుళా పురణించి, సుఖంబులందెనుఁ.

ఒక మనమట్టు, కీ నృపతి యుల్లము మార్పు సహించెనన్న;అం
దుకు, మన రోజు లిప్పుడు గతుల్ చెడియుంటయె కారణమ్ము; మె
ట్టుకు, గడు మంచివా డీత; డెటుం బరికించిన, భారతార్థ భూ
మికి ఎనలేని రాజపరమేష్ఠి; అనర్హుడు నింద, కర్భకా!

సేతు వింధ్యాద్రి పూర్వ పశ్చిమ సముద్ర
మధ్య గల రాజ్యమున కెల్ల మనుజ పతివి;
కాని, సామాన్యుడవె నీవు! కాల వశము
న, న్విరోధుల మైత్రి మీ నాడు; దేవ!

మీరును మేము స్నేహితుల మేయయినన్, గతమేమి లేకయే
వైరుల మైత్రి మిప్పుడు; నృపాల! విధిక్రియ; అంతెకాని, త
ప్పేరిది లేదు; శిక్ష విధియింపుము, శీర్షమె త్రుంచవో; భవ
ద్ధారుణి వీడి పొమ్మనెదొ; దగ్ధ మొనర్చెదొ; ఏమి చేసెదో.

అంచు, అమాత్యుఁ డన్న వచనార్థపు టంతర సాళులం, బిసా
ళించు దయా పరీమళ బహిః ప్రతిపత్తికి నైసనుఁ, గళా
సించి మనః ప్రవాహమున ఏమియు దా బిసివోవకే; తలా
రించి పరిక్రమించుచు, మహీపతి జెలువ [illegible]

వారితో పాటు, పట్టణ పాలకుండు,
తిమ్మరుసు తమ్ముడున్న, ప్రతీతి గాంచి
యున్న గోవిందుడు: గుంట్రలో నుండు ననుచు
అంపె; శ్రీకృష్ణ జన్మ సీమాంతమునకు.

అట్లు లోకకొంత కాలమ్ము అరిగ; సంత,
జైలు జీవిక భరియింప జాల, కతని
కొడుకు ఖైదును తప్పించుకొని దవీయ
మైన కొండవోక సీమకు, అరిగె; వరచి.

అలసి అతండు, నచ్చట దయా గొనరించె ఒకింత సేన, రా
యల నెదిరింప; గాని, అది యంతయు, ముందుగనే గ్రహించి: ఆ
ఖలు నెటులైన బట్టికొని క్రమ్మరి రమ్మని, కృష్ణదేవరా
యలు ఒక తెంపరిన్ బనిచె; ఆతడు, నాతని దెచ్చె; బిమ్మటన్.

తొల్లిటి కృత్యమే, మిగుల దూష్యము; సహ్యము కాని; దంతతో
ఉల్లము తృప్తి పొందదొ; మహోర్విపతిన్ నను, నిల్వరింతువా?
కల్ల; కులాన, విప్రుడవు కావున, ప్రాణము దక్క గల్గె; ఈ
ప్రల్లద మన్ననో, విడువ రానిద; దండ్యుడ వౌదు; వెమ్మెయిన్.

అని, తనముందు నున్న సచివాత్మజు, రాజుచివాట్లు బెట్టుచుం
గనలుచు బంచె, జైలు నధికారికి: వీనివి; వీని తండ్రి; వం
త, నెడపకుండ వీని పినతండ్రివి; కన్నుల నూడ బీక, వెం
టనె నియమింపు మొక్కని; అటం, చటు పిమ్మట పగ;లోనికిన్.

అనువేలంబ, అతండు ఆతని దదీయం బైన కారాగృహం
బున కంపించి తలారి దోడుకొని ఆ భూమిఁ బ్రవేశించి భూ
పుని ఆజ్ఞఁ వినిపింప; అప్పటికె, పొల్పుం దక్కి- యున్నట్టి తి
మ్మన, విన్నంత నెకొయ్యబారె; గడుగర్వ్యాంబుల విధివ్యాకృతుల్

కోప మి దేలా;
ఇంకను, నాపై,
దాసుడ నై తిని; కావవ? దేవా!

ఉన్నత సామ్రా
జ్యంపు సుఖంబే,
నమ్మితి శాశ్వత మం చలనాడు;

పార్థివ సేవే
మోక్షద మంచూ,
మూర్ఖుడ నై మది నమ్మితి ఎంతో;

భోగము లందే
టప్పుడు నిన్నూ,
కొల్వగ లేనయితిన్; జగదీశా!

తప్పులు ఒప్పుల్
గా, గొన లేవా?

ఈ జగ మంతా,
మిథ్యలే; బాబూ!
ఈ ఇహసౌఖ్యము, నశ్వర మే రా!

కొందరు మూఢుల్,
మర్త్య సుఖంబే
శాశ్వత మంచు, జరింతురు కన్నుల్
మూసుక పోయే
లాగు; నదేమో!

ఈ వసుధాతల పాలన కంతా
హాయిగ భోగా
లందుచు నాడు,
పెద్ద అమాత్యుడ నై దివసంబుల్
బుచ్చిన నన్నూ,
జూడరో నేడు;

అంతము లేనిది, మోక్షము తేరా;
పొందితి జ్ఞానం,
బింక; మహేశా!

కాలము బుచ్చగ జేయుము నన్నూ,
నిత్యము నీపా

దండ మిదే, కొను;
మో మహనీయా!

కొంత సేపున, కొకయింత కొలుకొనిన
హృదయ మార్మ్రైన, ఈశ్వరు నెంచి యిట్లు;
జైలు నధికారి గాంచి: రా జాజ్ఞ నిర్వ
హింప దగు; నంచు, మంత్రి వాచించె; నంత.

కడచిన కాల మందు, దనకంటె అఖండముగా దినంబులన్
గడపిన, ఆ మహామహుని కన్నుగవన్ దొలిపించె; అక్కటా!
చెడు సమయాన, ఎంతటి వజీరుల కైనను, ఆత్మ గౌరవం
బుడిగి సహింపగా వలసి యుండు గదా; ఎటువంటి నైచ్యముల్.

కనుకలి గోలుపుచ్చుకొని, ఖైదుననే మరి కొన్ని నాళ్ళు యా
పన మొనరించి, కష్టములు బాయుటకో యన, నేగ మంత్రి; అం
తనె, నిజ మైన హంతకు కథల్ వినిపింపగ; దాను పీటతా
టన మయి నందుకున్ బ్రభు, వెడందగడింది కృశించె; గందుచున్

తెలియక పోయె, నే విధి మతిన్ బొనరించిన; ఎంతద్రోహముల్
జలిపినవాడ నైతినొ, విశాంపతినై; ఇది, కొంత ముందుగా
దెలిసిన, దిమ్మనార్యుడు గతింపక నుండెడి నేమొ; కాని, రా

తల్లివి దండ్రివై, ప్రియము తామర తంపర కాగ, నీదు చూ
పెల్లను నా పయిన్ బరపి పెంచితి; చిక్కుల దోగు వేళలన్
వెల్లితు జేసి కాచితివి; వృద్ధి నొసంగితి; వింత యేల, ఈ
పెల్లిద మెల్ల, నీ విడిన భిక్ష గదోయి; అమాత్య శేఖరా!

ఇంత మహోపకారము గ్రహించియు, నిన్న సరాని మాటలన్
జంతల పాలు సేసితిని; చిక్కుల బెట్టితి; గేలిచేసి జీ
వాంతము ఖైదులో నునిచి; తంతియ కాక, త్వదీయ వీక్షణా
స్మంత మెనర్ప బంచి; ఎటు సైచితివో, ఇవియన్నియున్; బ్రభూ!

నాడు సభాంత రాళమున నమ్మికకున్ దగునట్లు నొక్కి నీ
వాడిన మాటలైన మనమందు మతింపకపోతి; బో, దరిం
గూడిన సభ్యులైన, ఇది కూడ దటంచు వచింప రైరి, మో
మోడిరొ; ఇంత, కొక్క హితముఖ్యుని గోల్పడితిన్; విధి ప్రభన్.

రాజ్యపాలనకు నర్హంబైన జ్ఞానమ్ము
ఒజ్జవై ఉపదేశ మొసగినావు
గజపతి ప్రభు కన్యకను బెండ్లి యగా నాడు
సఖుడవై వలపు లొసంగినావు
ప్రథితంబు లౌ సమరంబులన్ వైరుల
సహకారి వై చావ జదిపినావు
రాజకీయముల నల్లరు లేచి నవు డెల్ల
ప్రతినిధి వై మట్టుపరచినావు

మంత్రిమాత్రుఁడవా, నీవు మాకు? జుట్ట
మవు, సఖుండవు, తండ్రివి, మామవు, గురు
డవు, నగుదు; వట్టి నిన్ను, గీడ్పరచి వట్టి
కోపనుడనయి, పోకార్చుకొంటి; తండ్రి!

పాటన దక్కఁ నిన్న పుడు పల్వురు సభ్యుల ముందు, ఎన్నఁడుఁ
నోట లుఠింపనట్టి కఠినోక్తుల, మానసమర్మ ముచ్చిపో
నాటగ నాడి; తెంతగ మనస్సున గుంది కృశించి పోతివో
వాటము మాలి; నీయెడల బాపుడ నైతి; అమాత్య శేఖరా!

నీకును, నీ కులంబునకు, ఎన్నటికిఁ మర పొందరాని ఘో
రాకృతి ద్రోహకృత్య మొనరం జరియించితి; ఈ ప్రమాద, మా
ర్యా! కను నంతకుఁ విడువ రానిద; రే పొక వేళ, నిన్ను స్వ
ర్లోకములో క్షమింపవ గురూ! అనినఁ, క్షమియింప; కీతనిఁ.

ఇంతకు, నెన్ని చెప్పిన గణింపకపోతి, భవ న్మన స్సర
స్వాంతుడ నయ్యు నా; డిపుడు సారెకు సారెకు, దావకీన మ
స్మంత మెదన్ దలంచుచు గుమారిలుచుంటిని; సూర్యచంద్రులు
న్నంతకు, ఈ కళంక మనఘా! ఎడ బాయదు న; న్నాకింతయున్.

ఇంతలు అంతలుం బెనిచి, రీ మన ఇద్దరి మధ్య వై ర సం
క్రాంతి ఘటింప ద్రోహు; లది కానకపోతి, మృతాత్మ జాత దు
ర్దాంత విచార రజ్జువుల రాపడి యుండుట జేసి నాడు; జ
న్మాంతర మందు నేమొ, అనఘా! ఇక, గన్పడ; వీ భవంబునన్.

అదియటు లుండగా, సవల సంతట గ్రమ్మిన ఆంధ్ర రాడ్గృహ
వ్యథలకు, అంతు లేని ప్రమదాంబుధి మున్కలు పెట్టి పెట్టి: నా
కి దె సమయమ్ము, తెన్గుధర ణీశ్వరు బోరున నుజ్జగించి సం
పద మెయి రాయచూ ర్మగిడి పట్టి అఖండముగా వెలుంగగన్.

అని మానసించి ఏడిలు
జనపతి, రాచూరికోట సైన్యయుతుండై
కనుకని ముట్టడి వేయగ;
దెనుగుంబతి కదియు నిట్టు తెలియగ వచ్చెన్.

ఎదు రయి వచ్చి ఆంధ్ర పృథివీశ్వరు డీతడు, నిన్ను దాకగా
ఎదిరి రణం బొనర్చుట కొకింతయు దాలిమి లేక, ఆజిలో
బెదరి సమస్తమున్ విడిచి వీగిన, నీ అలనాటి దుర్దశన్
మది బరికింపవో; తిరిగి, మార్కొన వీగెదు; నిల్వ గల్గెదో.

ఆహవ పాండితీ గరిమ కంతకు, అగ్రణి తిమ్మరాజు నే
డాహవ భూమి లేమి, నను ఆజి నెదుర్కొన వచ్చు నంచు ఉ
త్సాహము చేసి వచ్చితె? విశాంపతి! మంచిది; నిల్వు మట్లు, నే
డే హావణించెదన్ గదన; మింక, ఎదిర్చెదో; నొచ్చి చచ్చెదో.

పేరునకున్ బ్రధాని ధర వీడిచి పోయిన, బోవు గాక; దు
ర్వారత దీయ సంగర కళామహిమం బది ఇందె యున్న; దాం
ధ్రీరమణాత్మలోన, గురుతించెదు రే పిక, యుద్ధభూమి మున్
బారిన రీతి ఓడి వెనుబాటున బారెదునాడు; సర్వమున్.

ఇతర మహీ తల ప్రభువు లెవ్వారి కేని, గ్రహింపరాని సం
స్కృత రణ శక్తిచే మిగులు ఇర్వది లక్షల సేనతో, విరా
జితు డీత డాంధ్రనేత; ఒక చిన్న మహీంద్రుడ వీవు; పోర, నే
గతి జయ మందెదో; తెలియగా వలదా? బల తారతమ్యముల్.

వెనుక, రాచూరి పోరు నందున దొలంగి
వీగు నప్పుడ, నిన్ను ఉవ్వెత్తు కొనక
పోవుట దొసంగు; కాదేని, పొంగలించ
గలవె నేడిట్లు? క్రమ్మర; క్ష్మాతలేంద్ర!

అని, కోపార్భటి నాళ నాళముల జ్వాలై వెల్లువై పారు వె
చ్చని రక్తంబున, దొప్పదోగి సమ రోత్సాహమ్ము ప్రేరేచగా
జనపాలుం డ, దె అశ్వమాత్రు డయి ప్రస్థానించె రాచూరి వై
పున; కెవ్వారికి జెప్ప కుండగనె, నిప్పుల్ గ్రక్కు కన్దోయితో.

అది స మీక్షించి సైని కాధ్యక్షు లెల్ల,
అట్టి తెంపున కెదల నత్యంత మలరి
వెంటనే సైన్యముల గూర్చి పృథ్వీపాలు
వెంబడించిరి; బహు విధ వేగ గతుల.

మొదట, ఏమో యనుకొని ఆ భూపు డటకు
వచ్చెనే కాని; కృష్ణభూపాలు రాక
క, దరి వె న్నిచ్చి పారె; దా నంతముందు
అతని భుజసార మొకసారి అరసె గనుక.

ఇట్టి భయస్థు డిట్లు; సమగ్రేచ్ఛ దయారయి వచ్చు టేల! సా
మ్రాట్టును, నిల్వరించు టది మాటలతో నగు కృత్యమట్లు క
న్పట్టినో; ఎమ్మొయిన్, నదకి పట్టుడు బీజపురంబు దాక; ఇ
ప్పట్టున, వీడరాదు రిపుపార్థివు; నంచన లేదు, పిమ్మటన్.

కాలము కాని కాల మిది, కయ్యము సేతకు; బ్రస్తుతమ్ము మీ
రాలము మానుటే కుశలము; మంచు, జమూపతు లెల్ల వేడ; భూ
పాలుడు, క్రమ్మరన్ నిజ నివాస పురంబున; కట్లు కానిచో
వీలగు నంత దాక, రిపు వీరుని జిందరసేసియే; చనున్.

క్రమ్మరి వచ్చి బీజపుర రాజును ఎమ్మొయి నైన బట్టి యు
ద్ధమ్మున ఇంకము దేపుడు తాదృశ సర్వ జన ప్రశాంతి భం
గమ్ము జనింప కుండ, దగు ప్రైదొ నరింపగ నిర్ధరించి స
ర్వమ్మును గూర్చు చుండె; నరపాలుడు, కాగల దుద్భటాజికిన్.

అంతలోనే, ఒకానొక వ్యాధి, విధి వ
శంబునన్ వచ్చి విహరించె, సార్వభౌము
దైహికోద్యాన సీమ స్వాతంత్ర్య వృత్తి;
పరిభువు మంచమ్ము బట్టె ఆవల; కృశించి.

కాలము కూడి రానపు డఖండ ప్రయత్నము లేనియున్ ఫల
శ్రీలకు దూరముల్ గద; ప్రసిద్ధ నృపుం డతడు, డంత కంతకున్
వాలక ముజ్జగిల్ల దనుబాసె; దిగంత పరీత మేదినీ

పిమ్మట, కృష్ణరాయ పృథివీపతి చంద్రుని అంత్యాశాస్త్రి ప
త్రమ్మున, దత్సహోదరు డుదారుడు అచ్యుతరాయ,లాంధ్రరా
జ్యమ్మున కెల్ల రాజయి ప్రజాపరిపాలన సేయ బూనె సా
ఖ్యమ్మగ; శ్యాలకుండు, సచివాగ్రణి పీఠ మలంకరింపగన్.

ఈతడు గూడ, శాత్రవ మహీశుల నెల్లర నొంచి బాసకుం
గైతకు బోషకుం డయి అఖండముగా వెలిగన్, దెలుంగు భూ
మీతల రాజ్య మేలి; అటుమీద, గుమారుడు వేంకటాద్రి త
న్మాతుల రక్షకత్వమున, క్ష్మాతల భారము పూనె; బొదలన్.

# విప్లవశ్రీ

సలక వంశ్యుడు, తిమ్మ రాజ ప్రధాని
సలుపు దారుణ కృత్యముల్ సైప జాల;
మైన, మా మాట కేమి; ఆంధ్ర భాగ్యోదయమొ,
మఱియు కాలమ్ము నచ్చు; గాన క్షితీంద్ర!

విందు నెపమ్మునన్ బిలిచి విస్తృత మందున జేర లేదటం
చెం,డగినో వజీరులను, ఏచి కనుల్ పెరికించె రాజ్యగ
ర్వాంధత; చెప్పు నేనా? ఇట్టి ఘాతని దుర్నయ వృత్తి, కేవల
గ్రంధిత వాక్కులన్; బలు కొరంగులు, దుష్ట దతండు; భూపతీ!

చంపించెనా, లేదా? సార్వభౌముడు, వేంక
టాద్రి భూపతిని; సాహసము బూని
పొలివుచ్చెనా, లేదా? భూపాలు పినతండ్రి,
రంగ క్షితీంద్రును; నిరంకుశముగ
కీడ్పఱచెన, లేదా? కేవల సోదరి,
వరదాంబికను; ప్రేమపాశ మెడలి
ఆక్రమించెన, లేదా? అన్యాయముగ, అఖం
డాంధ్ర సామ్రాజ్యంపు హక్కు; లడరి

అంత లంతలు సేసిన, అతని; కింక,
మాదృశు లనంగ ఎంత? సామ్రాజ్య మెల్ల
నామ మాత్రమ్ము కాగల; దో మహీంద్ర!
నీవు జృంభించి వాని దండించు వేని.

సామాన్యుండవె నీవు? సర్వ జగతీ సామ్రాజ్య ధౌరేయ సం
జ్ఞా మా లోల్లసితుండ; నీ వసలు, ప్రస్థానించినన్ శత్రు భూ
స్వాముల్ లొంగక పోరు; నీ కపుడు, నీ సామర్థ్యమున్ మెచ్చియే
భూపాలేంద్రుం డల కృష్ణరాయలిడె, దత్పుత్రిన్; మహీశాగ్రణీ!

అనుచు సామ్రాజ్య సామంత దనుజ నాథు
లంద రొక్కటయి పలికిన, ఆలకించి:
ఎంతలో, ఎంత మార్పు వహించె ఆంధ్ర
రాజ్య, మని బాధ పడె నాడు; రామ నృపతి

పలుకముమంత్రి, ఆఖరకు జల్పెడి దిట్టిద యంచు, నాడె ఆ
కలితము చేసి కొంటివి; అది కన్నులగట్టిన యట్లు సర్వమున్
బొలిచిన దిప్పు; డా చెనటి బూర్తిగ నాశనమున్ బొనర్చి పెం
పలరగ జేయవచ్చు నిపుడైనను; ఆంధ్ర మహీ ప్రభుత్వమున్

మరచితి, మాటల ధోరణిన్;
ధరణిపు బినతండ్రి సుతు, సదాశివు, ధాత్రీ
శ్వరు నొనరింపగ వలె; ఆ
చిరుతకు సేమంబ కద? వచింపుడు; ధీరుల్

క్రూరుడు వాడు, సుంతయును కొంకక యే తులువా స్వయం బనా
ధార మొనర్చు చున్న తరి, దైవ వశంబున జిక్కియుండ, ఆ
ధీరుడు, ప్రోలు వీడి పర తెంచి నటుల్ వినియుంటివి; ధాత్రికిన్

అని రామ క్షితి నాథుడు
కనుకని పృచ్ఛింప పొంగి తన్మాపతు లెల్లన్
"జనపతి! ఆతని వాసము
కనవలె; సేమంబ అతడు గావలె;" ననిరా

అతని వాసమ్ము మున్ముందు అగియు వలయు
అని తదన్వేష ణామునకు పనిచె నగిస
తెరువరుల రాజు; పదను, ఆ దిట్టలేగి
సర్వ మారసి వచ్చి విజ్ఞప్తి సేయ

రామ రాయలు, తిక్కటి రాజు లప్పుడు
వెంట రా, సదా శివు డున్న పృథ్వి కరిగి
అతడు దో తెంచ, కుశలమ్ము లడిగి అడిగి
తుదకు ఇట్లనె; ప్రేమ యొంతో దలిర్ప

నందల యొంట్రి నుండి అతి వైభవ మేది అఖండ కీర్తి సమృ
ద్ధిం దయివార, ఇం దనుక పంపు వహించిన దీ తెలుంగు రా
జ్యేందిర; అట్టి, ది ష్ఠా నిక్కృష్టుని మూలమునన్ దిరోహితం
బందగ నున్న, దీవు తగు నట్లు చరింపవ యేని; అర్భకా!

ఈ సమయంబునన్, ధరణి యెల్ల శిరంబున దాల్చి; విస్తృత
త్రాసకు వైరి సల్కము ప్రధానిని బూర్తిగ బాల్కి చూ; ర్పమా
మా నకలైక బాధలను, మాన్పవ? యింం చిప్పు దర్థి గోర వి

ఆతడు సమ్మతిన్ దెలిపె, అందుల; కంతట, ఆ క్షణంబ వా
రాతని కాంధ్రరాజ్య మది యంతయు బట్టము గట్టి, రంచిత
శ్రీ తనరార దైవ గృహసీమ; అనంతర, మామహాంధ్ర పృ
థ్వీతల చక్రవర్తికి నతి ప్రణుతుల్ పొనరించి; రందరున్.

అపుడు, సదాశివప్రభువు సల్లన దోడ్కొని గుత్తిదుర్గ మం
ద పరిమితంబుగా బలము లాతని రక్షణ నిల్పి యుంచి శ
త్రువనయు భావికాల సమరంబునకుం దగు యత్న మెల్ల, ని
శ్చలతే బూర్తి చేసికొని సంగరముం బ్రకటించె; పర్వడిన్.

ఆంధ్రవీర ! కదనభేరి,
ఎగసి మ్రోగ జేయ వోయి !

దిక్కు లెల్ల ఒక్క పెట్ట
జలదరింప జేయ వోయి !

రిపుల ఉడుకు నెత్తుట, బడి
తొప్పదోగి ఈద వోయి !

విప్లవకరు, రూపు మాపి
తెలుగు శోభ, నిలుప వోయి !

సమర భూమి, నృత్య మాడి
అమల యశము, దోసకు మోయి !

పద పద ఇక, తెనుగు తనయ !

అనుచు, ఉడుకు నెత్తు రాత్మయం దంతట
జల జల మని పొంగి జాలువార,
సమరగీతి పాడి సర్వారా ట్సనతో
కదలి వెడలె అనికి; క్ష్మావిభుండు.

బహామనీ రాజు లేవుగ వచ్చి సాయ
మీాయు, సల్కాను మంత్రి వారించె, రాజ్య
ఖానికీ వలి భూముల, దండు; సంత,
బెరిగె; ఇరువాగు సందున బెద్ద పోరు.

బవరం బా విధి, రెండు పక్షముల దీవ్రసహ్యాప్తితో సాగు చుం
డ, వదాన్యుం డగు రామరాయుని ప్రచండ స్వీయ తో శ్శక్తి, వి
ప్లవకారుం డరిగెన్ దివంబునకు; ఆపై, భామినీ రాజు లా
అవనిన్ వీడ్కొని పారజొచ్చిరి; భయ వ్యాలోల చిత్తమ్ములన్.

అది కని, కొంత సైన్యము రయంబున వారల నిల్వరింపగా
మొదలుగ బంపి; పిమ్మట, అమోఘముగా బుర వాసు లందరున్
ఎదురుకొనంగ, గేంద్ర నగరీంద్రము జొచ్చియు, అత్త లాదిగా
బాదలు ని శాత్రి వర్గమును, బూన్చె నతం డధిక ప్రహర్షతన్.

తడయక, వెంటనే తెలుగు ధాత్రిపునిన్ గొనివచ్చి బాంధవుల్
పుడమి పతుల్, సు హ్యాజ్ఞులు, ముఖ్యులు, లోనగు వారలెల్ల దం
డడి సభ నిండియుండ, వసుధాపతి జేసె నతండు వెండియున్;
గడలె సమస్త రాజ్యము అఖండముగా అప్పు; డాత్మ రోచులన్.

పదపడి, శాత్రవ శేషము
దుద ముట్టగ జేయవలయు దోన యటంచున్
మది బరికించి యొనర్చెను
కదనపు టేర్పాటు లెల్ల, క్ష్మావిభు; డంతన్.

బీదరు బీజపూర్వతుల పీచమడంచగ, గొంత సేనతో
సోదరు వేంకటాద్రిని, బ్రచోదితునిన్ బొనరించి; అహ్మదా
బాదు నృపాలు నొంచి ఎడపన్, బెద తమ్ముని దిర్మలప్రభున్
జోదు, నొకింత సైన్య మిడి జోకదలిర్పగ బుచ్చి; పిమ్మటన్,
తక్కుంగల సేనల, దా
నొక్కడు, గోల్కొండ నృపతి నొంచి మహాజన్
జిక్కగ జేయన్, దిక్కులు
దిక్కరి కంపింప, రామధీరుం డేగెన్.

ముగ్గురు యోధు, లల్లుగసి పోయిరిపు ప్రభు ధైర్య సంపదల్
నుగ్గయి త్రుంగు దాక, కద నోర్వర వీరవిహార మేలి పే
ర గ్గల మై రుచింప, విజయమ్ము గ్రహించి స్వ రాజ ధానికిన్
దిగ్గన గ్రమ్మరిల్లిరి; అదే పనిగా, రిపు లోడి ప్రమొక్కగన్.
అసదృశమైన దిగ్విజయ మంది, మహోదయ మెల్ల, ఒక్కటై
ఎసగి ముఖమ్ములన్ బొటకరింపగ, ఆంధ్ర పురీమ తల్లి సం
తసమున మున్గి తేలుచు గృతజ్ఞత దెల్పెను, స్వాగ తోత్సవ
ప్రసవ సముచ్చయమ్ములు; అపార బలాఢ్యులు వారిక ధరన్.

# సమరశ్రీ

సర్వ తంత్ర స్వతంత్రత, సార్వభౌము
ప్రతినిధిగ నుండి సకల సామ్రాజ్య కార్య
ములను, నెరపుచు ప్రఖ్యాతి కలిగి యుండె
రామప్రతినిధి, అక్కోటి సోము: డప్పుడు.

బహామిని రాజు లెల్ల, దన పక్కన పల్కుల బాటలన్ భయా
వహత జరింపు చుండ; అని నార్య భుజోద్ధతి, సింహళాంత మా
మహీ సకలమ్ము నాదినృపమౌళికి గూర్చుచు, రామరాట్ప్రభుం
డిహ పర కీర్తి దీప్తి హావణించెను నా: డెన లేని కైవడిన్.

ఆ గతి రాజ్య పాలనము హాయిగ సాగుచు నుండగా, అసూ
యాగతులై తురుష్క నృపు లైనగు: "రాంధ్ర ప్రభుత్వ వైభవం
బీగుట జూచి విందు దొంగెదమె ఆ శుభ వాసర ప్రభా
త్యాగతి ఎన్నడో" గద, అటంచు తలంచెడి వార; లాత్మలన్.

ఉరక కన్నెర్ర యే కాని, ఒంటి నృపతి
ఎంత బలవంతు డైనను, దిగంత దీప్తి
మల్లడించెడు ఆంధ్రసామ్రాట్టు నెదిరి
పోలయు లే డని, ఎరుగని పోరు; వారు.

ఏవురు ఏకమైనను, జయింపగ రానిద సర్వ సంపదా
భావృత మాంధ్రరాష్ట్ర పరిపక్వ మహోదయ మంచు గూడ, సం
భావన చేసియే అనికి బన్నిరి వా: రొకవేళ, మాకు ఆ
దైవమె తోడు వచ్చు నెడ, తప్పదు గెలుపను నిశ్చయంబునన్.

కాని, మాలోన మాకు ఏ కరణి నైన,
ఆత్మ కలహమ్ము లుడిగి సర్వైక మత్య
మొలయ వలె ముందు; దానికి, వలయు సకల
యత్న సిద్ధిని సాధించు; టవసరమ్ము.

అని, విచారించి తొంటి పోట్లాట లుడిగి
ఏక మైనారు తురక ధాత్రీంద్రు లపుడు;
అంత, వినిపించె ఆంధ్ర రాట్స్వాంతమునకు
ఆ యుదంతము; చారదృగ్వ్యాప్తి నొలసి.

తెలిసిన వెంటనే వసుమతీశ్వరు, డోలగమున్ రచించి శ
త్రుల దెగటార్చు మంత్రవృషధోరణినుండగ: ధాత్రియంతయున్
దలపడ వచ్చినన్, దెనుగు ధాత్రికి ఓటమి యన్న మాట, ద
వ్వులనె రహించు నెప్పుడు; ప్రభూ! రిపుదుర్జయు;లాంధ్రధీవరుల్.

అని, గంభీరత రామరాయ లనగా, జౌనౌ నటంచా సభా
ఘను లెల్లన్ దలలూపి; రాత్మ మురిసెన్ క్ష్మాభర్త; ఆపైన, దో
డనె రాజాజ్ఞలు కండ్ల నద్దుకొని తోడై వచ్చి, రా సింహ ఘో
ష్న విం ధ్యాద్రి పరీత భూపతు; లసంఖ్యా నీకినీ పంక్తులన్.

అప్పుడు, రారాజు ప్రతినిధి యైన రామ
రాయల కొసంగె, అల సంపరాయ కార్య
నిర్వహణ బాధ్యతను నెల్ల నెట్టనముగ;

కడచెను కొంత కాల మిట్లు; కన్పడె బిమ్మట, కృష్ణ కావలన్
వెడ వెడ శత్రు సైనిక నివేశన భూములు; తెల్గుజోదు ల
క్కడి విషయంబులన్నియును, కన్నవి కన్నయటుల్, స్వయమ్ముగా
ఒడయని కేర్పడన్ దెలిపి; యుజ్జ్వల వాగ్రచనా చమత్కృతిన్.

ఏపు గొలంది, తమ్ములకు ఇర్వుర, కాంధ్ర చమూ పతిత్వముల్
జేపడ జేసి: ఏగు, డని చేయుము, సాహస మున్పతిల్ల; ఈ
లోపల, నేను గూడ త్వరలో బలముల్ సమకూర్చి మీకు దో
డై పయనించెదన్; రిపు భయంకరు లార! జయమ్ము గావుతన్.

అని రామరాయ లనగా;
అనుజుడు, కే లోడ్చి తిర్మ లాఖ్యుడు, వినయం
బెనయగ: వృద్ధులు మీరలు;
అని జేరగ వలవ; దన్న! అని ప్రార్థించెన్.

ఇది యొక యుద్ధమా? అన; లసీమ బలాఢ్యుడు రామరాజటం
చిదివర కైన పోరుల గ్రహించియు; నేడిటు, మీర లాత్మలం
దుదిలకొనన్ సమంజసమా? ఊరక; వృద్ధుడనైన నాడు, నా
ఎదుట నెదిర్చి ఎవ్వడు రహించునో; తెల్పగదోయి, తమ్ముడా!

తమ్ముడవౌట సాజము, ఎదన్ భయమొందుట; కాని, సర్వలో
కమ్ముల పేరు గాంచిన అఖండ బలాఢ్యుడు, రామరాయలే
ఇమ్మెయి బోరితంబున జరింపక యుండిన; ఆంధ్ర కీర్తి భా
సమ్ము దిశ ద్విట్పాలురకు సాంతము లోకువ కాదె? తమ్ముడా

అదియును, నిన్న మొన్న వర కాత్మ పదస్థలి, వంగి వంగి నె
న్నుదురున జేయి సోకగ, అనూన విధేయత సంచరించు; ఈ
అధిపతులా? మహాంధ్ర వసుధా భరణుం డని పేరు గొన్న న
న్కడిననములో ఎదుర్కొని ముఖాముఖి నిల్చెడి బంట్లు;సోదరా!

ఇప్పుడు వృద్ధుడ నని బెగ్గడిల్లు నీవ;
కోడమ సింగమ్మ చాడ్పున, కదనరంగ
మందు గుప్పించి యెగసి పరాళి శేపు
ఇతడె చక్కాడు చుండ; హర్షింపగలవు.

అగ్రజు డిట్లు పేర్చి బదు లాడిన వెంటనె, సంపరాయ సా
మగ్రిని వెంట నుంచుకొని: మంచిది, మే మిక పోయి వత్తు; మం
చుగ్ర తళ త్తళల్ నొసల నుయ్యాల లూగుచు సందగింప, యో
ధాగ్రిము లైన, వారు సమ రావనికిన్ జని రప్పు; డియ్యరున్.

అరులు, తెగ్గపడి ఉత్తర మందు విడియ;
విడిసి రాంధ్రులు, దక్షిణ పృథ్వియందు;
ఉభయ సేనల మధ్య, దృక్సుభగగతుల
పారు చుండెను, కృష్ణా స్రవంతి; నాడు.

పలు యెసకంబు లేచి పెరవా రటు ఆవలి యొడ్డు దాటి ఈ
వలి కరుదెంచ కుండ, అతిభద్రతమై బచరించినార లాం
ధ్రు; లికపు, డే యుపాయమును దోచమి అల్లైవసించియుండి,రు

శుదకు, మా యౌవనశ్రీ, ప్రాగల్భ్యమించె
యవన జీమూత యత్న ప్రయాణమునకు
ఆంధ్ర సేనాను, లదియును ఆక్రమించి
గట్టు కావలి కెట్టించి కాచి; రక్షణం.

నడువర, వీరా!
జయ జయ నాదా
ర్భటు లెనయంగా;
రణ చర భేరీ
అదిలిచి కొట్టీ,
పదర; తెలంగా
ణపు రణ వీరా!

సమయ మిదే—రా,
సమర విజేతా!
పలుకర, జాతీ
యపు రణ గీతుల్
అరుల మనస్సుల్
భయపడులాగూ;

"సలుపర, రారా!
కదన విహారం

రణభువి నంతా,
అలుకర; ఆంధ్రా!
రిపు నవ రక్తాం
బువులను; లేరా

రిపు కుల కంకా
ణములను మ్రుగ్గుల్,
నలుపర; రారా—
కదన విహారీ!

కడగర, ఖడ్గం
బుల నల కృష్ణా
నది; జయ మందీ

వెనుకటి దేశా
భ్యుదయ యశస్సుల్,
నిలుపర; లేరా,
భరత కుమారా!

అనెడి రణావనీ తల ప్రయాణ నిరూపక వీర గీతికా
ధ్వనులు, దిగంత రాళముల వ్రచ్చి ప్రతిధ్వని సందడించె; ఆ
నినదములోన, అపుడె జనించెనో అన్నట్లు, ఆజి భూతలం

అప్పటికే, శత్రు సేనలు కనుగు దెంచి,
రతుల మూయోప మార్గ సంగతుల జెలగి;
అది సమీక్షించి రాను రా, జైన నేమి
చేయగల? రని పొంపిరివా యె; నచట.

వలికరాక కప్పు, మబు కెత్తు కదుష్ణ తను ప్రకీర్ణ ప్రో
త్స్ఖలిత రక్త నిర్గతి అమేయుర వార్భటి బొగ్గి పారె; దా
జాలయి, పాయలై, అలల సంకులతన్ బెను పెద్ద వాహినీ
జాలము లై, త్రిలింగ కుల సైనిక నాళ సమస్త గహ్వారిన్.

అదె, సమరోదయమ్ము మొదలయ్యె చమూయుగ వీధి; శ్రోత్ర హ్రా
ద్భిద ధిక దుంధుభీ రవళి దిక్తటముల్ పెకలించె, తన్నదీ
నదముల వాస్తరంగముల సందడిలో ప్రవిలీనమై; సమి
ద్బుధుల శ్రవః పథమ్ముల కపూర్వ మనోజ్ఞత పోహణించుచున్.

కాలము కడచిన కొలదిని,
ఆలము నల్గడల బెద్ద దయి జృంభించెన్;
వీలుచు, వ్రచ్చుచు, సేనా
జాలము హావణించె నాడు; సమర శ్రీలన్.

పర బల వీధి నేచి చొరబారుచు, నాడు తెలుంగు సేన ని
వ్వెరగున జూపరం దిగిచి వీర విహారము చేయుచుండగా;
పరచిరి, తాళ్మి గోల్పడిరి, పల్మరు గెల్పిక సున్న యంచు, బి
ట్టొరసి, విశ్రాంతి నొందిరి; అవ్యోమయు తెరి, దురాన శాత్రవుల్.

పది పదునేను లక్షల అపార బలంబున, యుద్ధ భూమిలో
పొదలు మహాంధ్ర సైన్యపుల ముందర; నిల్వ గలట్టి జోదులా?
మది బరికింప ఈ నృపతి మాత్రులు; సుంతయు దూరదృష్టి లే
క, దిగుదురా? వివేకమును గల్గిన వా; రిటువంటి పోరులన్.

అనుచు, అవలోకి జనులు తీ దాహవమున
నాటి శాత్రవ వీరుల పాటు గాంచి
హృదయ సౌ ధాంత ముల విహరింప సాగి
నారు పలుమార్లు; తమలోన దాము నాడు.

తెనుగు పటాలముల్, తనివి తీరని శూరత నట్టు లాజిలో
బెనగి బెనంగి శాత్రవుల భీతికి దావల మౌట; రామ రా
యనిహృదయప్రపూర్ణసభయందు, బ్రమోదపుదావులన్నియున్
దనిసి ఉపన్యసించిన విశాలకు, హద్దులె లే; వ వెట్టివో!

ముమ్మరమై, స్వకీయ తనుభూ ప్రదరంబున నున్న నాళ నా
ళమ్ముల జాలువారు, బహుళ ప్రమదంబుల; జొక్కి ఆజి మ
ధ్యమ్మున గొల్వు దీర్చి గెలుపందిన బంటుల జీరి ద్రవ్య దా
నమ్ముల, రామరాయ లలనా డొనరింపగ సాగె; హృష్టులన్

ఆ తరుణమ్మునందు, అత డాదట ఎవ్వరి నమ్మి అంగ ర
క్షాతల మందు నిల్పుకొన గల్గెనో; ఆ యవనీయ జాతి సం
జాత చమూపతుల్, వృజిన సాధ్వస మింతయు లేక, వంచనా

కించెదే పైన గబళించు కడక నున్న,
గాన శక్యంబె? ఏలాటి కాపు కైన;
లేని పోనిది కలహమ్ము బూని, వారు
తిరుగబడి, రిద్దరును; దను దేవు నదిరి

ఎంత బలాఢ్యులైన, మరి ఎంతటి సాహసులైన, ఒక్క, దే
శాంతము నంద నాంతముగ అందరు ఒక్కటియై పయిన్ బడన్
స్వాంతము చిక్కబట్టి అని జల్పిన జల్పగవచ్చు; గాని, యు
ద్ధాంతమునన్ బరాజయము దక్కిన నప్పుడియే; ఫలంబగున్.

అప్పటికి గూడ, రామరాయ ప్రధాని
బాగ రూకత బచరింప సాగె; గాని,
ఆంధ్ర శిరముల, దాస్య పురంధ్రి జాడ
ల గపడిన వప్పటికి; స్వాత్మ, నతని కపుడు.

అంత రివ్లవ, మే. వ
శాంతమునం దుదయమందు; అయ్యో డమే లా
వంతియు ఒలయుదు, నమ రా
భ్యంతరమున; ఒలయు నేని, అది దైవికమే.

చివరకు, సైన్యపాలకులు చేసిన సేతల మోసపోయి; మం
చి. వలను గల్గు త్రాచు వలుచీమల దాడి మలంగి వత్తలై
చివికి లభించు కైపున, మహీకృతి సర్వ ప్రతీప ధైర్యవై

ఒకమారు తమ కల హార్ద్యోగముల నిల్చి
పేచీలు తీర్చిన పెద్ద మనిషి
ఒకపరి సంగ్రామ నికటమ్ముల౯ దమ్ము
తరిమి చదిపిన యోధ స్వారోచి
ఒకనాడు తాను పే రోలగమ్మున సలా
మన తీవి దల యూపి నట్టి ప్రభువు
ఒకవేళ జెడి "కావు మో తండ్రి" యన దను
కిల గూర్చి నట్టి మహీశ్వరుండు

వధ్యు డైనాడు నే డంతవాడు; రిపుల
క క్కటా! కాల పరిణామ మందు, నెవ్వ
రెవ్వ రగుదురో; విధి సేత లెరుగ నగునె?
ప్రాయికమ్మగ, ఎంత వలంతి కైన.

అప్పటి కైన, ఆంధ్రుల బలాధికతల్ తరు గింత లేదు; తెం
దెప్పలుగా రణేచ్ఛయు, బ్రతీక్ష నెలర్చె; జయంపు టాశ యో
చొప్పడ దామె, ఆ తురక జోదులకున్; దెలుగుం బతాక గో
టప్పటి యట్ల శౌర్యకళ లింపెసలారగ, గ్రుమ్మరించుటన్.

కాని, బహు కాలమున నుండి కసటు లేని
స్వైరమున గల రుచి, వెక్కసమ్ము కాగ
జూచి; యిక, బాలి శతలోని వాచవియును

హితమున గల్గు పట్టుదల మూని, అటుల్ గయికొన్న ఆంధ్రభా-
రత ధరణీ ప్రభుత్వము, శిరంబుల దా మపు దేవురున్ వహిం-
చి తనరినన్, బ్రపంచ ప్రథ నొంది వెలింగిన నాటి తెన్గు సం
స్కృతి, కలకాలమున్ బృథివి నేలుకొనున్ గదః దీటులేని [illegible].

నిజమునకు అట్టిదే; కాని, నెమకి నెమకి
కాల్చి వైచెను, వారి మూర్ఖంపు కోప
శిఖి శిఖా జ్వాల; దాని నసీబు, నాటి
కంత మైనది; ఎవరి నేమనగ వలయు?

వారిలో వారి కేకభావమ్ము లేమి
వదలి పోయిరి, తమకు జీవలతి యైన
ఆంధ్ర సామ్రాజ్య ప్రాజ్య సింహాసనమ్ము
నెక్కుడకు శాత్రవు లెవ్వరు; నెడల బాగిరి.

# శ్రీ ర్ణ శ్రీ

నిన్న మొన్న వరకు, ఎన లేని సిరి సంప
దలను మున్గు తేలుకు నిలయ; మిప్పుడూ
తేమలి మట్ట మయ్యె, దిక్కు దివాణమ్ము
లేక; ఇదియ! బ్రహ్మ లేఖ నమ్మ.

సురపురి జేర బోయి; తడి చూచి భవ త్సహ జన్మలైన ఆ
తిరుపులు డాగ ఎచ్చటికో; దిక్కుల నెల్ల నిరంతరమ్ముగా
వరలిన తేన్ను కీర్తి, ఇక ప్రాభవముల్ తలిబెట్టి సాంత కా
పురమును జంట పెట్టుకొని పోవలయుల్ గద పడకో; ప్రభూ!

అంచిత ప్రేమమ్మై, అధికు లందరి ముంగట, నన్ను గొప్పగా
గాంచితి వంత్య వేళ దనుకన్; స్వర సామజ ఘోటకమ్ము లి
ప్పించి ప్రభుక బొనర్చితివి; ఇంతకు, నీ కొరక గ్రంథమేని అ
ర్పించుక లేక పోయితి; మహీపతి! నీ తను వున్న రోజులన్.

తగ్గనే లేదింత దనుక ఈ మెడ నీవువైచిన సుమమాల పరిమళమ్ము
మురువనే లేదింత మట్టు కెవ్వరు నాడు చెలగిన కనకాభిషేక గాథ
పట్టనే లే దింత వరకును సుఖనిద్ర పరిపంథులైన భూపతుల కెల్ల
బాటనే లే దింత దాక ఈ తోంటికర్ణముల నీ నాటి కంఠారవమ్ము

పాయనే లేదు నిక్క మిప్పటికి గూడ
కంటి కెలకుల భవ దమోఘ ప్రపంచ
గేయ గంభీర సుందరాకృతి; అదేమొ
ఎందు జూచిన నీవ కన్పింప; వధిప!

ఎవరికి ఏది శాశ్వతి? యనేకులు పాలన చేసినార లీ
భువనతలమ్ము; అం, దొక స్వప్నమును లేదిపు; డట్ల నీవునుం
దినము సలంకరించితి; వధీశ్వర! ప్రాణము లుండు దాక, శా
త్రవ కుల భీకరత్వమున రాజ్యము చేసి; సుజన్మ నీదె పో!

అని పలు కైపులన్ మది, మహాకవియౌ అల రామరాజ భూ
షణు, డపు డా మహా నగర సౌష్ఠవ దుర్గతి గన్నులార గ
న్గొని యొక మొందునన్ బొగిలె, గుండెగుభేల్మన; గుండె వెండియున్
గనుగవ గోష్ణ బాష్పములు కాల్వలుగట్టి స్రవింప; న త్తఱిన్.

అకటా! దక్షిణ ప్రా క్ప్రతీచి త్రిదిశా వ్యాప్తాంబురా శ్యాధిప
త్య కిరీటమ్ము వహించి శ్రేణివడి త దైశ్వర్య సంభూతి, నీ
సక లాశా పరిపీత భూవలయు సంస్థానమ్ము నం; దట్టి నీ
కి, క ఆ జీవిక తెల్లవారె గద; తల్లీ! ఆంధ్ర విద్యా పురీ!

అనుపమ ద్రవ్య రాశుల నహర్నిశలుం దళు కొత్తు రేవు ప
త్తనములవర్తకమ్ము, బహుధా చెనకింప; "ప్రపంచమందు నా
కె న యగు పట్టణమ్ము మరి యొందును లే" దని చాటివిర్ర వీ
గిన, అల నాటి నీ హొయలు కీడ్పడి పోయె గదమ్మ! నేడిటుల్.

అతులి తైశ్వర్య శోభల నవఘుళించు
నిన్ను, ఆనాటి పండు వెన్నెల దినాల
గనిన ఈ కన్నులే; నేడు కాంచ వలసి
వచ్చె, నీ పాడు దశయు; నా పాప మేమొ!

శ్రీనాథ కవిరాజు సీస పద్యాలు మ్రోగి
తేలిన ముత్యాల శాల యేది?
పిన వీరభద్రుండు పృథ్వీశు సన్మాన
సంపద గొన్న [illegible] మేది?
జంట కవీశ్వరుల్ సార్వభౌముని యుపా
యనము లందిన సభామంటప మేది?
పెద్దనామాత్యుండు పృథ్వీశమూర్తి స
న్మానమ్ము లందిన స్థాన మేది?
సార్వభౌముడు [illegible] సన్న
బలలార్చిన చమత్కారపు టుర్వి యేది?
కటకటా! తుద కెంతటి కష్టకాల
మావరించిన; దాంధ్ర విద్యా పురంబ!

చిన్నెలు వన్నెలుం దొలక జేయుహాయి నుపచరించు వేళ, నిన్
గన్నులు హర్షకాంతి దనుకం గని పోయిన పెద్దనాది వి
ద్వన్నుత సత్కవీశ్వరులె ధన్యులు మెట్టుకు; నాకు బట్టె, నే
డన్నిట హావళిం బడిన ఆత్మ పరీక్షణ; మెంత పాపినో!

అటు బీహారిటు సింహళమ్ము వరకుం వ్యాపించి పైకొన్న ప్రా
కట శౌర్యాంధ్ర మహీ ప్రభుత్వము నసంఖ్యాం బైనసంపత్తుతో
బటు దోశ్శక్తి ప్రపంచ మెల్ల బొగడన్ బాలించి పేర్వడ్డ నీ

నియ దుద్యాన వన పరిఘాణములలో, విశ్వేక్షణ ప్రాప్తి ప్రీ
త్యయ సంప్రీతుల గ్రేళ్లు దాటెదు లస త్స్వేదాగ్ర కోటీర సం
చయముల్, పౌరులు తీర్చి చూడ్కులకు హర్షాశ్చర్యముల్ గొల్పు ఆ
అయ సంధాయి దినాలకున్; ఋణమా నిర్యాతమ్మ కావచ్చునో!

దేవా! తిర్మలరాయ! అగ్రజుడు పొందెన్ పాసినన్, పాసె పో
సి వే మైత్రి, వధేద్య శూరుడవు? పోనీ, సైన్యమే మయ్యె? తే
వా, వైరి ప్రకరమ్ము త్రెంచ గల శస్త్రాస్త్రమ్ము? లట్లాహవ
శ్రీ విడన్ జనునా? స్వదేశము నశించెన్ గాదె; నీ పోకడన్.

జరయూ దేరనట్టి సుతు డాహవ మధ్య పోకాలు వేళ; వా
చారియు, దోల్చి, ఫల్గుణుడు సైచి రణం బొనరింపడే? జయ
శ్రీ రమణీ మణీ హృదయ సీమ గనుంగొను దాక; అంతకున్
మారిన దుఃఖమూ, ఇది? గమించిన వేమొ; తెలుంగుపుణ్యముల్.

సురచిత్, ని స్సనం జనడు; మా లిఖితమ్ములె తీర్చి యున్న, సో
దర మృతి దుఃఖ నిస్ప్రహా కతమ్మున ఆజి దొలంగు నప్పు, ని
న్మరలిచి కర్మయోగపు క్రమం బుపదేశ మొసంగు నట్టి శ్రీ
హరి నను దెవ్వడైన ఒక్కడయ్యెడ బొల్చిన యుండు; భూపతీ!

హరిహర రాయ లాదిగ, బరాంతక దక్షుడు రామరాయ భూ
వరమణి దాక ఉన్న బలవజ్జన పాలుర తోడు నీడలన్
విరివిగ జొప్పరించి పలు పేటల కవి వెలార్చి, తట్టి నీ
మురిపెపు గాల, మింక కనబోను గదా; నగ రావతంసమా!

కరలిన యట్టి ఆంధ్ర వసుధా పతుల, కొంత యనంత శ్రద్ధ నీ
కొరకయి ఖర్చు పెట్టిరో, ముసింగ ధనాశు లటుంచి, ఆ యలం
కరణము తెంచి పూన్చుటకు కాల క్రమంబున; అట్టి నీ పసల్
కెరిగి అదే విధాన నృపులతెంచుట; కెన్ని యుగాలు పట్టునో!

కరలేదు దుఃఖపుం జతగ లో బడి సేయుట చేసి, యిట్లు ని
న్నరక పతింబడిం దలచు చుంటి; అదే ఒకవేళ, కష్టపుం
జెరగు ఎరుంగ నట్టి జనదృష్టికి పిచ్చిగ నుండునేమొ; లా
వెరిగిన, నీపనంగు తనువేదురు గొల్పదె! యెంత దారిదిన్.

పోర్చుగీసు సైన్యసు మున్నను ఖండాంత
రీయ దృక్కుల చీకిలించు నాడె
ఆంధ్రుల వాణిజ్య మన్య ఖండాలతో
బలసి యొల్లెడ జీరువారు నాడె
దేశ భాషా పోష భాశలు మాతోన్మొగ
నీరగానమ్ము గావించు నాడె
బురుజు బురుజున ప్రభువులు పన్నిన లీన
జెనుగు పెక్కముల కై పెనయు నాడె

పరుల సుంకాలు దెచ్చి ల్లని పఠాత్తు నాడె
మాచిపం జూడవలయు నీ చోద్య; మకట!
నేను కనబడ, దింతలో నెచటి కేగ

ముందును వెన్క నందనపు భూముల పైరు, పసందు గొల్పుచుం
డం దళుకొత్తు మేడల విటంకములం; దొకయింత తాకినం
గందెడు నేమొ దేహపు వికాస మనం దగు రోవెలందుకల్
కందుక క్రీడ లాడ, గన గల్గిన ఆ సమయాలు; రా వికన్.

చూచుకొలంది, చూపులకు జుట్టరికం బెనయించు మాధురీ
రోచుల వెల్లిగొల్పెడి చెలుల్; వెనకో, న్దొరసాన్లతో దొరల్
పూచిన పూల దోటలకు బోయి తమిన్ బ్రమదైక దృష్టి దో
బూచుల నాడె,డా హరువు ప్రొద్దుల బో! భవదీయ యోగముల్

బాటల మధ్యమధ్య, బరిపాటిగ పర్వడి యున్న యట్టి శృం
గాటక మూలలందలి, దృగద్భుత నందన భూములందు; స
య్యాటల నా డె, డా మురిపె మైనను, పోవడ జేయలేద! క్రూ
రాటన దీక్షు, నిన్ను బయిరాగిని జల్పెడు నాడు; శత్రులన్.

ఈశులు, రాజకీయ పదవీశులు, సత్కవితా ప్రపంచ రా
జ్యేశులు, కవితోడ విహరించిన ఆ సొగసైన వీధు; ల
బ్బా! శవ భూత జంబుక నివాసము లైనవి నేటి కిట్లు; హృ
త్కోశపు గ్రంథు; శేపుచెడి క్రుంగెదు; అయ్యవిచూచునంతకున్

అలనాడు సార్వభౌములు నడాడిన చోటు
లీ నాడు దెయ్యాల కిరవులయ్యె
అపుడు వారాంగన లాడి పాడిన చోట్ల
ఇపుడు భైరవగాన మెగయు చుండె

మునుపు కేరాణి వాసనల దోగిన మేడ
లీనాడు శవగంధ మీను చుండె
వెనుక రాచకుమారు లెనసి ఆడిన దొడ్లు
ఇపుడు రాబందులు ఎగురు చుండె.

మునుపు రాజాధిరాజులు పొంగలించి
సభలు దీర్చిన ముత్యాలశాల, ఇపుడు
ప్రేతనాథుని దర్బారు వీధి యయ్యె;
అబ్బ! గుండె పగులదె? ఏ ప్రాణి కైన.

ఇదియె కాబోలు, మంత్రీంద్రులు హావణించి
సిరు లొల్కజేయు కచేరిసాల
అదియె కాబోలు, దండాధికారి నృపాలు
గదిసి పను ద్దెల్పు గర్భగృహము
ఇదియె కాబోలు, శ్రీకృష్ణరాడ్విభు డోఢ్రు
మాపి కట్టిన జయ మందిరమ్ము
అదియె కాబోలు, రాజాంతఃపురపు కన్య
లలసి నేర్చెడి మహా లాస్య శాల

కూలి కూలక యుండుట, గురుతు పట్ట
నంతగా వీలు కాకున్న, దాత్త పూర్వ
పరిచయస్థుడ నైనను; వాసి గన్న

ముప్పది నాల్గు వీధికలమొత్తమునన్, వెలలేని శోభతో
ఒప్పిన, నాటి నీ బ్రతికియున్న దినంబుల; జేరువారి కన్
రెప్పల గ్రేళ్లు దాటి విహరించెడు, అప్పటి రాణి వాసపుం
గప్పుల గుంపులా, ఇవి? హా కాలినవే! ఇవియుం; బురీంద్రమా!

జిలుగు మక్కా తెల్ల చీరలు హొంగైన
మైతీవ లందు గమ్మగ జలింప
మల్లి మొగ్గల పరిమళము జిమ్మించు వా
ల్జడలు పిరుదులపై లాస్యమాడ
బాడీలు జాకట్లు పైటలు దాటి చ
న్గట్లు చాదీలపై గదను ద్రొక్క
కనుకలి మిరుమిట్లు దొనకించు తొడవుల
జిలిబిలి ధ్వనులు పాటల మలంగ

రో వెలందుకలు దసరా రోజు లందు,
రక రకంబులు మా నైన లాస్య గేయ
ములను బచరించు, ఆ రమ్యతలమటు!ఇది;
కటకటా! ఇప్పు డెమ్ముల కళ్ళ మాయె.

దసరా ప్రొద్దుల, రేడు లోక జన నీ ధామంబునన్ జేరి రా
జన మిాగన్ నతు లిచ్చి వచ్చుతరులన్, స్వాముల్ పయింజల్లుపూ
లె, సగన్ రేగు సువాసనల్ నెరపు ఆ యిక్కుల్ గదా ఇవ్వి? నే
స్త్రీ సి! దుర్వాసనలిచ్చుచున్నవి; చెలాయించెన్;విధిధ్వాంతముల్

వి ద్యారణ్య మహర్షి వ్రాసిన, త్వ దావిర్భావపుం గుండలీ
గ దోర్జ్యజ్జివిక హద్దు లింత వరకే కాబోలు; ఏ మైన, ని
ర్వాద్యం బైన వెలుంగు వెల్గితివి జీవం బుండు నం దాక; ఓ
వి ద్యారణ్య పురీ! పురీంద్ర మన, నీవే సుమ్ము; విశ్వంభరన్.

పరిమితి లేని వర్తకపు భాగ్యమునన్, హారు వైన శోభతో
మురిసి జగాన గొప్ప దని పొల్చిన ఆంధ్రుల రాజధాని; లా
వరి యమదూత లెల్ల అసివారుగ ఏగెడు సీమ యయ్యె నే;
డె రుగగ రాదు కాదె! యెపుడేగతి పట్టునో; ఇంచు కేనియున్

ప్రాభవంబున దేశభాషల మాగాణి
ప్రౌఢరాయలు దున్న బంచు నాడు
ఉదయాద్రి లోనుగా నున్న దుర్గము లెల్ల
గుండరాయలు గెల్చుకొన్న నాడు
కోత కందిన తెనుంగుం జేల సస్యమ్ము
కృష్ణరాడ్విభుడు కోయించు నాడు
రాజ్య విప్లవము మూలంట మాయించి రా
మక్షితీంద్రుడు పరుల్ మలచు నాడు

శాత్రవాసృక్ నదీ నద జలము కతన
తెనుగు పరపతి మాగాణి గొనబు మడుల
మంచి తీరైన పంట పండించి నావు
ఆత్మ జాతక యోగ ద శాత్మకమ్ము.

తురకల నేలలో విజయ దుందుభి గొట్టుచు రామరా, జవా
కరు లొనరించు ఆ సుఫల కాలము లం, దెటువంటి కీర్తితో
తిరిగితివో కదా తనివి తీరగ; నే డటువంటి నీవు, ది
క్కరి ఇటు లైతి తుట్టతుద; కక్కట!ఆంధ్ర పురావ తంసమా!

కరు వయ్యెనె సైన్యంబులు?
ఇరువది లక్షలకు దగ రహించెడి, వింకె
వ్వారి కంతటి బల మున్నది?
అరరే! దైవిక బలంబె; అరుదై పోయెన్.

ఇదియె కాబోలు, ఆంధ్ర మహీంద్ర మౌళి
ఉండు దేవిడి చేరువ నున్న నాటి
కోట లోపలి చివరి కవాట సీమ;
నవ వితంతువు లాగు, గన్పట్టు; ఇపుడు.

నిండు జవ్వనపుఁ నిగ నిగల లోన
ముద్దు లొలికించు, చా నాడు మురియు నట్టి
దండ నాథు హవేలి కాదా, ఇది? కట
తరుగు కొని పోవు, చూచు నంతకును; కడుపు.

అవు నటే! ఇది రాజ్యమందు నంతట జెలా
మణి యైన టంకాల మందిరమ్ము
కా దటే! ఇది ఖండ ఖండాంతరాలకు
సరకుల నంపు బజారు సీమ

ఇదియా! మనోవీధి నెగిరి గంతులు వేయ
దబ్బిబ్బు లాడు శాద్వల ధరిత్రి
ఇదియే కదా! బహు విధముల దృగ్జ్యోత్స్న
నాట లాడెడు ప్రజోద్యాన భూమి

నాటి ఆ శుక్లపక్ష దినాల, జెలగి
తుంచి వెన్నెల బుడమి కాపించు నీవ;
కడకు ఇట్లైతి; బ్రహ్మ లేఖకుల, కవ్వు
డిచ్చితో, లేదో, లంచాలు; పిచ్చితల్లి!

మడుల జలమ్ము స్వచ్ఛతరమై పొడగట్టు హయామునందు, పై
పొడవున వెన్ను లీను వరి భూముల లేత పసిండి మందువా
విడుదలలో; దమాషగ నవీన పదంబుల, బంటలక్ష్మి ఆ
డెడు, అల రత్న గర్భము లకే! ఇవి; అక్కట! చూడ లేనికన్.

తళ తళ మంచు దోరణ పద స్థితముల్ మణి రోచు, లేచి క్రో
శుల కొలదిం గ్రమించు అల శోభన వేళల, ఇంద్ర కేంద్ర ని
స్తుల పుర బాహ్య తోరణముతో జమవచ్చిన నీకు? ఈ మహా
ప్రళయ వికార రూపము! పుర ప్రథమైక కవాట దేహళీ!

సంగమాన్వయ రాజ చంద్రుల అరచేతు
లందు శైశవ క్రీడ లలరు నాడు
సాళువ వంశీయ సార్వభౌముని అంక

తుళువీయ చక్రవర్తుల బిగి కౌగిళ్ళ
నిండు జవ్వనము రాణించు నాడు
ఆర్వీటి వంశోజ్జ్వలావనీంద్రుని అంతి
పురమున గౌమార మరుగు నాడు

స్వర్గ సామ్రాజ్య పాలక పట్టణంపు
వైభవ శ్రీకి మారటవై తురంగ
లించి మించితి; వట్టి నిన్నిప్పు, డకట!
అరయు కొలదిని, కటకట లాడు మనసు.

ఆంధ్రభాష సమస్త మైన సామ్రాజ్యంపు
వ్యవహార భాషగా బరగు నాడు
ఆంధ్ర రాట్ప్రతినిధు లై అన్య దేశాల
తెనుగు వారు యశమ్ము దొనకు నాడు
రాయచూ రాది దుర్గము లెల్ల జెలరేగి
ఆంధ్ర గజములు గోరాడు నాడు
బహమనీ రాజాది బల వద్రిపులు తెన్గు
కత్తికి హారతు లెత్తు నాడు

ఆంధ్ర పుత్రుల మైన మా ఆత్మ లెంత
మురిసి పోయెనో, ఇపు డంత పొగల వలసి
వచ్చె ఈ నాటి నీ దురవస్థ గాంచి

తెలుగు ప్రమేయమే నెగయు దెంచని కన్నడ ద్రావిడాది భూ
ములకు, దెలుంగుబాస అతి ముఖ్య సమాదర పాత్ర భాషయై
వెలుగు దినాల, స్వైరపదవిం దులకించిన ఆంధ్రజాతి; అ
న్యుల, కిక దాసతన్ మెలగు చుండవలెం గద! ఎల్లకాలమున్.

అంతము లేని స్వేచ్ఛమెయి, ఆంధ్ర మహీపతి హస్త పల్లవా
భ్యంతర సీమలందు; అటు పై, దదమాత్య గృహాల; అంత, సా
మంత నృపాల సౌధముల; మంచిగ రోజులు బుచ్చి తింత ప
ర్యంతము: ఇంక, ముం దెటు నడాచెదవో; కవితాతలోదరీ!

మానవ జీవ నౌక కసమానపు బాటలు జూపి మంచి పే
రూనిన వేద భాష్యమున కుద్భవ భూమి; కడింది తీయవుం
జాను తెనుంగు పల్కుల మజా అసివారిన నేల; నేడు, క
ర్మాను భవాన కీ విధి గులా మయి పోయిన; దేమి చెప్పుదున్.

నవ ఖండంబుల రాజధానులు వదాన్యంబైన హోదా గడిం
చి విశేషంబుగ రాజ కార్యములలో జేయూతగా నిల్వ ఈ
అవనీ చక్రము గేలి వ్రేలున సునాయాసమ్ముగా గిల్చి స్వై
ర విహారంబుల గేళ్ళు దాటియు, దివాలా తీసె నే; డక్కటా!

# చరమశ్రీ

ఉద్దిలకొని కలంచు ఉల్లము సవరించి
విజయ నగరి కలిమి విలయ మగుట
విభుని సోదరుండు పెనుగొండ బొనరించె
ఆంధ్ర కేంద్ర శాస నాల యమ్ము.

తిరుమలదేవరాయ జగతీశ్వరు డీతడు, గొప్ప సాహితీ
వరుడు; కవీంద్ర కోవిద సభా పరివేష్టితు డై అజస్రమున్
హరువుగ రోజులం గడపు చాంధ్ర మహీధరణీ ప్రభుత్వముల్
తిరిగి స్థిరం బొనర్చి. జగతీతల మేలె; ప్రజానుకూలుడై.

గీతగోవిందమునకు వ్యాఖ్యాత, భట్టు
మూర్తి కవిరాజ మౌళికి పోషకుండు
వసుచరిత్రాఖ్య కావ్య సంపదకు భర్త
ఇతడు, తిరుమలదేవ పృథ్వీశ మౌళి.

పిదప, శ్రీరంగరాయలు విభుని సుతుడు
సకల సామ్రాజ్య భారమ్ము సవదరించి
పాలనము చేసె, కొన్ని సం వత్సరములు
వాఙ్మయం బన్ని ప్రాంతాల పైకొనంగ.

రాయసము వేంకటపతి, రాయన అహోబలుడు, భట్టు
కాలంకుడు — వీరు, శ్రీరంగదేవరాయని ఆస్థాన
కవులు. ఇందు, వైవా రిరువురు రాజకీ యోన్నత పద

అటువయి, అర్వదేశమును అన్నకు మూరుగ నేలు చున్న వేం
కటపతి దేవరాయలకు, గద్దె నొసంగిరి ఊరి పెద్ద: ల
న్నిట సక లాంధ్ర రాజ్యరమ నేలుటకుం దగువాడ వీవ, దో:
పటుతర శక్తి నేల మిక; పార్థివశేఖర! యంచు బల్కుచున్.

ఎన్నియొ విప్లవాలు తల యెత్తె నితండు తెలుంగు గద్దె చే
కొన్న యనంతరమ్ము; తనకుం గల ఆప్త జనంబు: లీ ధరా
భ్యున్నతి కింక, అంత్య దివ సోదయముల్ చనుదెంచె నేమొ;లే
కున్న, ఇదేమి యంచు, భయ గుంభిత మానసులై చలింపగన్

నంద్యాల పురి నేలు నట్టి కృష్ణమ రాజు
విభుడైన వెలిగొండ వేంకటాద్రి
దక్షి ణార్కాటులో దనరు పాలెము కోట
కధిపతి యాతిరా జతని ప్రజలు

ఉత్త రార్కాటునం దొప్పు మురాసులు
మన్నె మేలగాచెడి మనుజ పతులు
చెన్నూరు పురికి వజీరు వేంకటరాజు
లింగమ్మ వెల్లూరి రేడు ఘనుడు

మధుర తంజావురీ జింజి మనుజ పతులు
మున్నుగా గల సామంత భూపు లెల్ల
తిరుగ బడినారు తమ ధరిత్రీశు హక్కు
తుడిచి పెట్టంగ పెద్ద సందడుల నాడు.

ఇట్టి పరిస్థితుల్ పొటమరించిన గూడ చలింప కుండ, చీ
కొట్టి అడంచివైచె దనకుం గల శాత్రవకోటి నాంధ్ర సా
మ్రాట్టుల కృష్ణరాయలకు రామ మహీపతికిన్ సమాను డీ
దిట్ట యటంచు నద్దెస లదే పనిగా దను బ్రస్తుతింపగన్.

పిమ్మట, గోలకొండ పృథివీపతి మాలియు గూడ ఆంధ్రరా
జ్యమ్మున కెత్తివచ్చె; అది ఆరసి ఆంధ్ర మహీంద్ర మౌళి శీ
ఘ్రమ్ముగ శత్రు దాకి సమరాన బరాజితు జేసె; స్వీయ స
ర్వమ్మును ఆజిలో విడిచి వైరి, హుటాహుటి పారి పోవగన్

ఆవిధి,గోలకొండ వసుధాధిపు నొంచియు దాళికోట యు
ద్ధావసరంబునన్ రిపుని హస్త గతంబయి చీలియున్న ఆం
ధ్రావని భాగముల్ తిరిగి ఆంధ్ర ధరిత్రికి జేర్చె; తొంటి సు
శ్రీ విభవాలు వెండియును జీబుకొనంగ తెలుంగు భూములన్.

ఏమాత్రింబోకోరంతగా, సకల వ్యాప్త త్వాంధ్రసామ్రాజ్యపున్.
భూముల్ వెండియు గెల్చి ఏలిన మహా భూపాలు డీ రాయ; తె
న్నో మైళ్లావల నున్న యూరపు ధ రానూన ప్రజా హృద్గృహా
రామ శ్రీలకు గూడ బ్రాకినవి; ఈ రాజేంద్రు కీర్తి ప్రభల్.

అంతము లేని కీర్తి గలట్టి మహీపతి రాజకీయ భా
స్వంతుల లోన అక్బ; రటువంటి మహామహుడే; తెలుంగుభూ
కాంతుని వీని ఊహాల వికాసము లోవల దెల్ల బోయి భా

అంతటి తెల్వి తేటలు గల్గి మహీపతివరాళి శుక్తి, ఉ
ద్క్రాంతభుజా బలంబు నెరయ చంద్రగిరిన్ బెనుగొండ వెల్గుచిన్
స్వాంత ప్రభుత్వ కేంద్ర నగ రాభరణంబులుగా బొనర్చి ఆ
శాంత మహాంధ్ర రాజ్యరమ సంతయు నేలె; లస ద్యశస్వియై.

చక్రవర్తికి గురుస్వామి తాతాచారి
గ్రథనమ్ము లొకవంక కసిమసంగ
అతి నిరంకుశుడైన చతురుడు రామలిం
గని ఘంట మొకట గర్జనలు సలుప
మంత్రాంగ విదుడైన మల్ల అనంతుని
లేఖిని ఒకవంక శాఖలీన
అతుల పాండిత్య సంగతుడు అప్పయదీక్షి
తుని వ్రాత లొకట చిందులను ద్రొక్క

ఎంద రెందరో ఇంకను ఇతర బుధులు
కవులు స్వేచ్ఛా విహార శంఖంబు లూద
తెనుగు దర్బారు నవ నవ్య దీప్తి దొనకె
వీని స్వామిక తపనీయ వేళ లందు.

పదపడి, గండికోట నరపాలుడు కృష్ణమరాజు కొల్వు నా
స్పదముగ జేసి ఆత్మ నవభావ తరంగిత భారతీ లస
[illegible] బచ్చారు లొనర్చి అనంత కీర్తి సం

అంతియే కాదు, నాఁటి భాగ్యంబ దేమొ
వేద వేదాంగ బహు వాగ్వివాద సభల
బాలు గొనుచుండె అనిమిష భాష లోన
ఎంత పండితుఁడో! మహీకాంతు డితఁడు.

> వేంకటాంబ, రాఘవాంబ, పెద ఓబాంబ, పిన ఓబాంబ,
> కృష్ణాంబ, కొండాంబిక: ఈ ఆరుగురు శ్రీ మ ద్రా
> జాధి రాజ, రాజపర మేశ్వర, శ్రీ వీరప్రతాప, వీరవేంక
> టపతి దేవరాయులకు ధర్మపత్నులు.

అయినను, రాజరాజునకు ఆంధ్రుల దుర్దశ జేసి సంతు సుం
తయు నుదయింప దాయె, వసుధా పరిపాలన భార మూఁపయిం
బయికొని నిర్వహించుటకు; ప్రాజ్య త్రిలింగ ప్రభుత్వలక్ష్మి ప్ర
శ్రియమును సన్నగిల్లె నన జాలును బో; ఇక, తెన్గు గడ్డపై.

అది యొక గొప్ప లోటుగ, ధరాధిప చంద్రుని పెద్ద భార్య నె
మ్మది కగుపించె; ఆ సమయమంద ఒకా నొక విప్రకాంత నె
మ్మదిగ త దాప్తురాలు గల మందిర భూమికి వచ్చి: నెచ్చెలీ!
హృదయపు బెంగ నింక త్యజియింపుము;నీకొక మాట,జెప్పెదన్.

సంతు కోసమ్ము బెంగ లేశమ్ము గూడ
వలదు; నెల తప్పినది నాకు ప్రస్తుతమ్ము
శిశువు జన్మింపగనె నీదు చేతి కిత్తు
కనుక, నటియింపు మీవిక గర్భవతిగ,

అనిన విని, వెంకటాంబిక అంతు లేని
హర్ష నక్షత్ర దీక్షి విహార మొనసి
నెచ్చెలిం జూచి: ఇది నేను నీవు దక్క-
ఇతరు లెరుగని రీతి జరింపు; మమ్మ!

అని, తన బ్రాహ్మణి సఖిని అల్లన బైటకు సాగ నంపి గ
ర్భిణిగ దదాది దాను పచరింపగ దక్కెను; అంత, భూసు రాం
గనయును మాసపూర్తి అవగానె సుతుం గని రాణి కంద జే
సె నతి రహస్య భంగి; హరుసించి కురంగటి భామ, లాపయిన్.

మా దొరసాని చక్కని కుమారుని గన్నది, యౌవరాజ్య సం
పాదక భాగ ధేయములు పట్టిన వానిని నేటి ప్రొద్దు; ధా
త్రీధర మౌళి కీ శుభ పరిమళ వార్తనెరుంగ జెప్పి ఆ
మోదము సేయరే? యనుచుపుచ్చిరినౌకరులన్;ద్వారాత్మనై

యౌవన మేగ, పశ్చిమ వయస్సున నున్న పడంతి, సంతతి
శ్రీ విభవమ్ము గాంచె నని చెప్పిన నమ్మగ రాదు; నమ్మకం
బోవగ రాదు దైవిక విభుత్వము నెంచిన; యంచు నెన్నియో
భావము లుగ్గమించినవి పట్టణ వాసుల; కంత టంతటన్.

ఇంతయు, నాత్మలో నెరిగియే; జనపాలుడు, భార్యమీది కొం
డంతటి ప్రేమ నేమనక ఆత్మజు జన్మ దినోత్స వమ్ము ల
ల్లంతన, రాజ్య మంతట నెలర్పగ గట్టడులం బొనర్చె దు

అంత, వానిని జిక్కరాయలుగ జేసి
ఈడు దొరబడగానె, రచించె వడుగు
పెండ్లి మున్నగు వేదోక్త విధుల నతని;
కాత్మ వల్లభ నలరించు కడక; నతడు

ఇంత రచించియున్, వసుమతీశ్వరు, డా యువరాజు నొక్క దు
ర్గాంతర సీమకుం బనిచి గౌరవ బంధితు జేసె; వాని వి
క్రాంతి స్వకీయ విక్రమ సురక్షిత భూ విభవాల, కెట్టి ని
ష్క్రాంతియు సంభవింపని నికామ వరిష్ఠ పథ ప్రరోచులన్.

కాలము కొంతమట్టుకు బొకాలిన ద; ట్లటుపైన, మేదినీ
పాలక మౌళి మంచమునుబట్టె రుజా గతుడై; తెలుంగు వి
ద్యాలతకుం, దెలుంగు కవి తారమకుం, దెలుగుం బ్రభుత్వను
శ్రీలకు, ఇంక, "ఏ యెడను చేపడునో" యని పృథ్వి జంకగన్.

ఇక, జీవించుట తోచ దీ రుజ సమీక్షింపన్; మహీ పాలనా
త్మక భారం, బిపుడే మ రొక్కని భుజా దండంబునన్ బెట్టినన్
సుక; మంచుం దన సోదరీ సుతుని, దక్షుం, జిక్కరాయప్రభున్
వికస న్నమ్ర ప్రవర్తనుం, బిలువనంపెన్ దత్క్షణం; బొక్కనిన్.

మామ కృపామయుం బగు నిమంత్రణమున్ శిరసావహించి త
ద్ధామము జేర రా, నతడు, దక్షిణ హస్తము నెత్తి: రాజ ము
ద్రా మహితంపు టుంగరము, దారక! ఇయ్యది; దీని దాల్చి ఈ

పలికెనో లేదో రాజటు, గుభాలున, వాని మనస్సు నిల్వనీక
గలగె; శరీరము తోటను గంపము పైకొనగా దొడంగె; మా
టల దడ బాటు పుట్టె; కిరటాలుగ నశ్రుల వెల్లి పొంగుచుం
జల జల బారె, గంటి తెరచాటున; దోచెను, స్వేదబిందువుల్.

దానికి, నెమ్మనంబుల నితాంత పుటచ్చెరు వొందుచున్న సే
నానులు మంత్రులాది గల నాయకు లెల్ల మరింతగా వితా
కూనగ; ఒక్క పెట్టున, బ్రభూత్తము పాదము లాని వా, డదే
ధ్యానముగా, ధరిత్రి పల దంచును వ్రేచ్చె; ముఖమ్ము జూచుచున్.

అటు, తన కాళ్ల పై బడి నిరంతర దుఃఖపు టశ్రు బిందువుల్
బొట బొట కార నేడ్చెడు ప్రభున్ బయికెత్ గొని లేవదీయు, జెం
గటి దొరలన్ బురిం గొలిసి; క్రమ్మర, ఆంధ్ర మహీంద్ర మాళిదృ
క్తటముల పృష్కలం జొనిపి దక్షిణ హస్తము నెత్తె; మెల్లగన్.

రాచరికమ్ము గొన్న, దన లావును ఎట్టి విపచ్చ లాటువుల్
కాచితలిర్చి పచి అరి కట్టునొ యున్న భయమ్ము చేత సం
కోచము జెందుచుండ, గయి కొ మ్మని దగ్గరి వార లెల్ల బ్రే
రేచిరి: దాన, ముద్రిక ధరించెను రాట్సుతుం; డెట్టి కేలకున్

నా తరువాత, ఈ పరగణాలకు పీఠిని మీర లందునొద
నేతగ భక్తులై పరిగణించుచు బట్టము గట్టు; డంచు, ఆ
ఖ్యాతము చేసి తెన్నుడిగారపు పంటయు, తెన్ను స్వేచ్ఛయున్

అంత, శ్రీ రంగరాయ నా మాంతరమున
బరగు చిక్కరాయలను సంప న్మహాంధ్ర
సర్వ సామ్రాజ్య భూమికి సార్వభౌము
జేసి; రచ్చటి పెద్ద వజీర్లు కలసి.

దానికి, కొంత మంది బహుధా హారుసించిరి; కొంద, రీర్ష్యలం
బూనిరి; ఇంక, కాల మెటు పోయి ఎటుల్ చనుదెంచునో అటం
చా నవ చక్రవర్తి తన యాప్తుల జేరువ నుంచి, దుర్గసీ
మానము చాట గొల్చె అనుమానము కల్గిన వారి, నందరిక్.

అగ్ని కాద్యము తోడగు నట్లు, లపుడు
మనుమనికి భూమి రావలె ననుచు బెనగు
జగ్గరాయుని కుటిలపు జతన ములకు
బలము చూపించె; ఆ వైర భావ చేష్ట.

కోట వెలువడి నట్టి ఆ కుటిల దండ
నాయకుల గుంపు సర్వము, నాటి నుండి
జగ్గరాయుని తరుపున సార్వభౌము
కూల ద్రోయం బ్రతిజ్ఞ గైకొనిరి; బలసి.

వాలు మగంటిమిం గలుగు పార్థివ చంద్రుడు మేనమామ, ఈ
పాలన భార మంతయును, వ ద్దను చున్నను పట్టు పట్టి తా
నేలాగో నాశిరమ్ము పయి నెట్టుట? అ ట్లొనరింప కున్న, తాం
తాళ మొసంగ కుండును గదా ఇపు; డీ పలుగాకి మూకకున్.

అని, ధరణీశ్వరుండు హృద యాకలనమ్మున బ్రొద్దు మాపులుం
దోణికిస లాడు చుండ; అట, దుర్నయు లాతని ఆధిపత్యముఁ
జెనకి తలంగ జేయు కను జీకటిలో నెమరిదు చుండి ర
ల్లన; గుటిలంపు టూహాల వలంతి స్రవంతి బెనంగు లాడుచున్.

అంతకు మున్న కప్పముల నన్నిటి మానిన వార లెల్ల: అ
ర్పింతుము, మీకు రా దగిన విప్పుడ పూర్తిగ; ఆజ్ఞ యైన, ద
ర్శింతుము; పూర్వ వైరముల నేమరి ముమ్మ ననుగ్రహింప, నా
శింతుము; విన్నవింతుము విశేషములం; దమకొల్వుముంగటన్

అని; ఒక అర్జీ పత్రము
అనిపిరి రారాజు కడకు; అది, కని రేమఁ
మనమున నిజ మని నమ్మచు
అనుమతి బంపించె; గోట కరుదెంచంగన్.

అదె నృపు బట్టగా సమయు మంచు జొరం బడినారు లోన, నె
మ్మదిగ స్వసైన్యులై పొలికి మార్పుచు గావలి వాండ్రవారు; అ
య్యది గమనించి ద్వారముల నన్నిటి వెంటనె మూయు, ఆజ్ఞలం
పె ధవుడు; కాని, లాభమగుపించదు; కాలము మించిపోవుటన్.

కొంత కొరంతగా, తమకు కోట సమస్తము చిక్కె; అంత నీ
వింతట: దుర్గమున్ విడిచి యేగుము బైటకు; ఏగుదేని, ప్రా
ణాంతక మైన ఆపదకు అగ్గము కాకయె ఉండవచ్చు జీ
వాంతము, వేమి కొనుత హితాపులముంగట హాయిగా; నృపా!

అని, అల దుండగీంద్రు కబురంపిరి; అయ్యాది చూచి రేడు, చే
యున వెదియుం గనంబడమి, ఉత్తలపాటున గోట వీడి పో
యెను స సతీసుతంబుగ; అదేమొ! ఒకందును గూడ, రేనికిఁ
వెనుకటి మాదిరిన్ వినతి పెట్టడు నా; డటు పోవు చుండగన్.

ఆ గతి సర్వమున్ విడిచి ఆవలకుం జనుచుండ, చుట్టునున్
మూగి అరెస్టు చేసి కొని పోయిరి వానిని, వారు బంది ఖా
నా గదికిఁ సతీసుత జనంబుగ; బట్టను గట్టి రా పయిన్
ప్రూగినవేడ్క తొంటి యువరాజున; కెంతటి ఘోరకృత్యమో!

అందరు కూడి ఏకమయి ఆవిధి నాతని క్రిందు మీదు సే
యుం; దుద కొక్క సైనిక దళాగ్రణి మాత్రము విప్లవాన పా
లందక; రాజభక్తుడయి అప్పటి ఆ దురవస్థ నుండి రా
జ్యేందిర గ్రమ్మరించి ఎసగింప, బ్రతిజ్ఞ వహించె; గట్టిగన్.

ఏచను నాయకుం డనఘ,అహీన పరాక్రమ శాలి ఆత; డా
నీచుల నుండి తొంటి ధరణీ పతి వెల్వడ జేయుటే, ప్రధా
నోచిత కార్య మం, చరసి ఊరక ఎత్తుల పైన ఎత్తులన్
వైచుచు నుండెః కాని, నెరపన్ గను పింప దుపాయ; మెద్దియున్

ఎత్తుపై యెత్తులఁ వైచి ఇప్పుడు రేని
ఖైదు కాపుట కూహించు కడక కంటె
అతని పుత్రులలో నెవ్వ నైన ఒకని

అని ఆలోచన సేసి; బంధన గృహంబం దున్న, శ్రీరంగరా
యని పుట్టంబులు బాగుచేయు రజక వ్యాపారు రప్పించి: భూ
పునకీ లేఖను జూపి, త త్సుతుని తెంపుం బెంపు గావించి, తో
డ్కొనిర మ్మొక్కని; మంచికానుకలుసీకున్ముట్ట చెప్పించెదన్.

కొని వచ్చు నప్పు డెవ్వరు
కను గొనని రహః ప్రతోళికల గను మని లే
ఖను ఇడి పంపిన, చి త్తం
బని వాడును కులుకులురల, నావల కేగెన్.

ఊరక లేదు నాడు మొద లొక్క నిమేషము కూడ వాడు, రా
ద్ద్వారకు నప్పగించెడు ప్రధానపు బత్తుల గాక; ఒక్క నా
డా రజకుండు, మంచి సమయంబును జూచి తదు త్తరమ్ము శ్రీ
వారికి చేతికిచ్చి ఫలవంత మొనర్చెను కార్య మంతయున్.

ఆవిధి చాకలి తెచ్చిన
భూవిభు సుతునూది ప్రభువు తన పూటకకుం
జేవ ఘుటిల్లె న టంచును
భావ స్వాతంత్ర్య నౌకపై విహరించెన్.

రాయనిపుత్రు డొక్కడు చెరంబలకించి చటుక్కునన్ బరా
రాయె; నికన్ బ్రతీపవసుధాధిపుపన్నుగడల్ ఫలించు; గ
ట్టా! యని జగ్గరా జటమటంబడి బిట్టు అలందురెన్, మనః
స్థాయి దలంగి; రాజును, బదంపడి మార్చె మరొక్క చోటికిన్.

ఘూరించి, ముందు కంటె అతి మాత్రము జైలున గట్టుదిట్టముల్
గూరిచె ఊరబోక; అవి కూలకటి వ్రేళ్ళను పెల్లగిల్లు న
ట్లూరయు చుండె ఏచమ దళాధిపు; డేవిధి నైన, ఆంధ్ర ల
క్ష్మీ రమణీ ధ్వజమ్ము బయికెత్త దలంచిన వాడుగావునన్.

తనకు, విశ్వాస పాత్రులు తన దివాణ
పుం జవానుల గొందరి బోగు చేసి
"రాజు చెర బాప వలయు నేలాగు నైన
మీర" లని, వారి నాత డేతేర బనిచె.

పనిచిన వెంటనే చనిరి వారును, ఏ యెడ రాజ రాజు జై
లున బడి యుండెనో అటకు, లోగడనే అల జాడ లన్నియుం
గనుగొని; అంత, జైలు నధికారి గృహంబున భృత్య వర్తనన్
దినములు బుచ్చుచున్, సమయదీక్ష మెలంగుచునుండి; రందరున్.

అంత, దమ కను వగు సమయమ్ము జూచి
బ్రిహ్మ కేనియు తెలియనిభంగివారు
కంద కమ్మును ద్రవ్విరి ఖైదు గదికి
సూటిగా అంచనా వైచి, జడిగి జాఁగి.

దాని వెంబడి, రేడున్న తావు జేరి
భక్తి జాగిలి మ్రొక్కి: దేవా! త్వదీయ
శ్రేయముల్ గోరు ఏచమ నాయకుని జ
వానులము; వచ్చితిమి దొరపనుపు జేసి.

వచ్చిన వారి నెల్ల, దెలి వాలిక కన్నుల పార జూచి; స్వీ
యోచ్చిత గోరు, ఏచముని ఉత్కట దీక్షను నచ్చి; దైవమున్
మెచ్చి; "ఉపప్లవం బిక, శమించెగదా" అని, నిమ్మళించి; పై
పెచ్చుగ పొంగి పొర్లెడు, నవీన మన స్స్మృతి దోగ రాజటుల్.

ఒక సామాన్యపు నౌకరుల్ పరుల సాయుజ్యం బొకింతేని గౌ
రకయే, సర్వము నిర్వహించితిరి మీరల్; ప్రౌఢ వాదోత్యతిత
ప్రకటశ్రీ గల, మమ్ము బోంట్లకె దురాసక్తైన కార్యమ్ముల్; సా
ర్థక జీవుల్ గద! మిమ్మువంటి పనివాండ్రెందరో న్న భూమీశ్వరుల్

అని, హరుసంపు మాటల విహార మొల స్ఫుమ రంగరాయనిం
గని: యిక, దాము మా వెనుక కాల్నడ రండిదె, మా ప్రభుండు పం
చిన పను; పాలసింపకుడు; శీఘ్రము లెం; డిటువైన, గాలయా
పన మయినం బ్రమాదము;నృపా!యని వాగలుతొందరించినన్.

ఇప్పుడే, మిమ్ము గూడ రప్పింతు; సంత
పరచు, నిర్యోడ మెలగుడు భద్రముగ: న
టంచు, దన యాలు బిడ్డల ననునయించి
తెనుగు బిడ్డడు తెగి బయల్దేరె నపుడె.

అట్లు సురంగ మార్గ గతుడై చనుచుండ, జవాన్లు చూడ్కి వా
ల్గాట్లకు జిక్కిపోయి, వసుధాపతి, ముందటి కంటె నెన్ని యో
రెట్లధికంపు బాధల గురిం బడిపోయె; అదృష్ట రేఖ చీ
కట్లు మలంగున; స్థైపరు గల్గిన నేమి? అగణ్య మంతయున్.

ఆ విషయమ్ము లేకలు బయల్పరచఁ విని: ఇంక, గించి దు
చ్చావచ సర్వ నాశనము జల్పక వీని నుపేక్ష చేసినన్
భావి నుపద్రవమ్ము ప్రభవం బయినఁ అవ వచ్చు నత్తఱి పా
ల్యావని; కంచు, జగ్గవసు ధాధిపు డాత్మ దలంచె; ఉగ్రుడై.
తలచిన తత్ క్షణంబ, నవ ధాత్రిపు భేరిట నాజ్ఞలంపె: ఉ
త్తలముగ, వాని వాని సహధర్మిణి, వాని కుమారికాకుమా
రుల, నలుసంత యైన, బుయిలోడక పట్టి సమాప్తి సేయుగా
వలసిన దంచు, జైలుదళ వాయికి; ఎట్టి కసాయియో కదా!

అనిపెనో లేదో అనలటు; లా క్షణమే, నరికించి నైచె జై
లున గల నాయ కాగ్రణి, అలోమని ఏడ్చెడు చంటిపిల్ల లం
గనల యుతంబుగా వెలుగు కాంతు, నొకింతయుజాలిలేక; మో
కున బగియించి గొర్రెలను గోసెడు పచ్చి కసాయి కైవడిన్.

ఇకపయి, హాయిగా మనము డీ యధిరాజ్యము నేలవచ్చు శ
త్రుకులము మాసె గాన, అకుతోభయ మానసుడై అటన్నన
మ్మిక నతి డుండగా; బయుట మేటి . పుకారుజనించె: దుంవత్రేం
కర విష డింక, ఎచమ నృపాగ్రణి యుంచు; మరింత కుందగఁ

అట్లు వదంతి పుట్టె; నిటులప్పుడ, ఆతని నుండి ఉన్న దు
న్నట్లుగ వచ్చె వార్తయు: ధరాధిపు, వానికుటుంబముఁ, జెరం
జిట్లె వధింప జేసితి; విసీ! ఒకయింతయు బాపభీతి లే
కట్లు; నరుండవో, దయ పొకాలిన దైత్యుడవో, మహీశ్వరా!

శ్చి మహీశ్వరుం; డతని సంతతి చచ్చె; దతీయు పత్నియుం
చ్చెను నీకతంబున, విశాంపతీ! ఇంక, ననుం, మదీయ బా
బాచ్చ యుద్దైన; రేని సుతు నుక్కడగింపుము; తెన్ను రాజ్య సం
ద్భయ మెల్ల, వలుకోన వచ్చును హాయిగ; సర్వదిక్కులన్
ల్లుడు నీకు, నాకొ హితు, డా చనిపోయిన రాజరాజు; భూ
ల్లభ! ఇందు, నీకు గల బాధ్యతయే గణుతింప గొప్ప దీ
ల్లవు కాని, ఆతని మ హోన్నతి నిల్పగ; అట్టి నీవ, ఈ
ల్లరి నెల్ల నాయకుడనై నడిపించెదు; డెంద మొప్పెనో!

రితికి నన్నాళ్లు బ్రతుకె ఫ్స్పైన; అట్టి
ఈ తుది వయస్సు నం, దిట్టి ఆత తాయి
నుల దెగబడెా; దెద నిహ పర మనీష
లదొ లేదొ ప్రభూ! నీకు; తెలియు; దకట!

టు బరికించినన్, బరిగణింపగ జాలని ద్రోహి వైరి, వేం
టపతి సార్వభౌమునకు క్ష్మాస్థలికి; క్షమియింప జెల్ల దిం
టు నిను; వృద్ధరాజ! సరదాపడి యుద్ధమె సేసెదో; మహిం
టుకున ఒప్పగించి జనసంతతి గాచెదొ, తెల్పు; మేర్పడన్.

గడ మొనర్చి వీచముని చంపుటయో, కికురించి స్వీయ ప
గు నొనరించుటో, ఎదియొ, సాగియె, యుండెడి దింతవట్టు గ
గ సిటునైపునిల్చి పురడించిన ఆవోర లిప్పు డన్య ప

ఎవ్వరో యొక, శిల మొగరించి పలు
కొనిన పలుకో నీక; ఈ గొడవ లెల్ల,
పెనిచి అంతటి సార్వభౌమునకు మామ
నయ్యె; అఖర కవకీర్తి గగ్గ నైతి.

పరి పరి విధముల నందు గె,
నరపతి ఇమ్మాడి, వైరి నాయకు డా యు
త్తర మంప; బిగప, దా ని
బ్బరముం గొని ఇట్లు కొంత నడి రూపించెగ.

కోరినదిత్తు నన్ను నను కొ మ్మని కోరిన, సమ్మతిగ దరిం
జేరునొ; లేక, వర్ణనము చేయగ రాని మ హోగ్ర మూర్తియై
ఊరక నూరి పోయునొ; ఎకో, ఒక డా గద రెంటు; ఇంక, వ్యా
పారము చేసి ఇట్టు లోక నా త్తను బంపెద; జూచె; దా పయిన్.

అని, జగ్గరాయ లేచను
జనపతికిన దెలి ప హృదయ సర్వస్వం; బా
యన, అది గని మది నంతే
గినిసి ఇటులన్ జవాబొసంగ; కిమ్మనకుండన్.

లేని పోని దురాశల నూని నీవు
గట్టి తిన్నది కాగ; సి గ్గరి ప్రమత్త
పూర్వ కంబుగ నన్నును ప్రోత్సహింతు

ఇపుడు మదీయ రక్షణ రహించెడు ఈ వసి కూనయో, మహీ
విపుల త్రిలింగ రాజ్య పదవీ గ్రహణార్హుడు; [illegible] దక్షిణ ఈ
విపుల మరొక్కనిన్ బడయ వీలగునా? ఎవ రేమి చెప్పినన్
జెపుదురు గాక: ఏచముడు చేకొన; డింక, మహీంద్రు డీతడే.

న్యాయము పంపు సేయుదు రనంతయు, ఇట్టి కుతంత్ర బుద్ధిక
న్యాయము కాని; వృద్ధ నర నాయక! యైన, దెలుంగు విస్తర
శ్రీయిది చక్రవర్తి సుతు జేరమి; కేచము డేమి యయ్యె! లే
డా, యిల! రాజ రాడ్గృహ శిఖావన కంకణ బద్ధ హస్తుడై.

కొనల నమర్చి ఏచముడు మోహరముస్ ప్రకటించు నేసి, అ
తని నెదిరింపగా దగిన తాలిమి లేదు; పరిస్థితుల్ రణం
బున కెర గాక పూర్వము, ప్రభుత్వపు జోక్యము [illegible] హెచ్చుగా
మనసు తెగింప దా ముసలి మానిసి; కిం, కత డేమి చేయుబో.

పోరిత మాడకే, ఉరక భూమి గడించిరె? ఎన్న [illegible]
ద్వీరమణుల్; ప్రశాంతి పరివీత వచస్సుల వాడ [illegible] కింతయున్
దారికి రాడు; యుద్ధ మిక తప్పమియో ఎద నోచెదు, వాసి నా
గ్ధోరణి చూచినన్; ముసలి తొత్తున కింత ప్రలోభ ముందురో!

అని రణంబున కవహితుడై సమస్త
బలములన్ గూర్చి ఒక శుభ వాసరమున
ఏగె దండెత్తి వృద్ధ రాజేంద్రు పైకి

తన తలపెట్టి నట్టిది యథా విధిగా నెరవేరగా, అతం
డనుపమ హర్ష వా ర్నిధి దయా రయి నిల్చిన మాన సైకసౌ
కను గొని; తన్మ యోపచిత గంధ వహా క్వణ దూర్మి వీథులం
దున, విహరించె న; ట్లుల ప్రదోష హి మాంశు హాస స్మరీచులఁ.

అప్పు డొక మంచి రోజున, మహా మహులు డా దళవాయి, సర్వ భూ
నృపతుల ముంగటన్, తెలుగు నేలకు ఆ కడగొట్టు బిడ్డనిన్
నృపతి నొనర్చి; ఆంధ్ర మహా నీయుల, కంతియు కాదు, సత్పథ
స్నపితుల కెల్ల, పూజ్యుడయి నా;డతడేమి తసం బొనర్చెనో!

అతడు, తెలుంగు రాజ్య రము నంతయు నేలిన రంగరాయ భూ
పతి; తన దేశమందు దమ వర్తకముఁ నడిపించు కొంట కా
నతి కయి వచ్చి వేడు కొని నట్టి బ్రిటిష్ ప్రజ, కాదరించి న
మ్మతి నిడినట్టి ప్ర ప్రథమ మానవ ముఖ్యుడు; భాగ తావనిఁ.



## శాంతిసమరము

ఇది శ్రీ తావసానులు సత్యదుర్గేశ్వర కవులచే రచింపబడినది; రాజకీయమగు ఏకాంకిక — నాటిక. ఇట్టిది మన ఆంధ్రభాషలో లేదనియే చెప్పవచ్చును. ఆంధ్రవాణి పత్రికలో ఇది ఇంతకుపూర్వము వెలువడినదే. ఇప్పుడు పుస్తకాకృతి ప్రకటితమైనది. ఎంతసేపూ ప్రేమికాప్రేమికుల కట్టుకథలతో వినుగెత్తియున్న ఆంధ్రహృదయములకు ఇదినవ్యతనూ, దేశభక్తినీ, దేశసేవనూ పురికొల్పుటకు సమర్థమైయున్నది.

భారతి-1940-నవంబరు

## రత్నేశ్వర ప్రసాదనము

ఇయ్యది శ్రీ గురురామకవి సంస్కృతమున రచించిన నాటకమునకు శ్రీ సత్యదుర్గేశ్వర కవుల ఆంధ్రీకరణము. శ్రీ సత్యదుర్గేశ్వర కవుల తర్జుమాయును మాతృకపాకము చెదరకుండ గావింపబడినది. సిద్ధహస్తులు మరి యెన్నిట్లు గావింతురా?

త్రిలింగ-11-ఫిబ్రవరి-1946

## ప్రణయస్వైరిణీ—

లో చంద్రగుప్తమౌర్యుని వివాహమాడిన హెలీన ఎట్లు తన ఊహా ప్రపంచములో స్వైరాభిలాష నాశ్రయించి విహారముల నోలలాడుటకు అనువైన సుమహార్గ మేర్పరచుకొన్నదో శ్రీ సత్యదుర్గేశ్వరకవులు ప్రాచీన భాషాలక్షణబంధములకు దాసులుగాక స్వేచ్ఛగా తమ కవితాధార సాగించారు.

సంపాదకీయ విమర్శ.

## భావలహరి

రచయితలు, సత్యదుర్గేశ్వరకవులు. ఇది ఖండకావ్యము. అయినా రచన నవీన పంథానే నడచింది "ప్రబోధము" లోని ఈక్రింది పద్యాలు ప్రాచీన భారత ప్రతిభను చక్కగా చాటుతున్నాయి... ..."ఈనాటి అమెరికా భూమియైన నిలవజాలునె నాటి వెన్నెల దివాలకు?"

"కవీ" అని సంబోధిస్తూ రచించిన "కాళిదాను స్మృతిలో ప్రపంచ ప్రఖ్యాతిగన్న నాటకకర్త తన జీవితాన్ని రచించుకోలేదేమో! అనే విచారాన్ని వెలిబుచ్చిన కవికుమారుని "సుంతయైనను మానూని నూనుపట్టు ఆత్మకథవ్రాయవైతికదా" అన్న పలుకులు చదివి అతని కవితాప్రవాహమందు విహరించు శుభసమయములందు కన్నీరు కార్చని వారెవరు? "క్షామపిశాచిని" బొమ్మని అదలించే కవికుమారుని వీరత్వము "కవిః నిరంకుశః" అన్న లోకోక్తిని నిరూపించుకొన్నది. "పెండ్లికొడుకు" "అత్తింటికోడలు" మొదలయిన సాంఘిక రాజకీయ సమస్యలు—"జగపతిఖడ్గమా!" మొదలగు క్షాత్రవీరుల చరిత్రలు చదువరుల రక్తనాళాలలో మరుగు పడిన శౌర్యాగ్నిని రగులు కొల్పుతాయి.

శ్రీ హరికృష్ణ
శ్రమజీవి
రాజమండ్రి

## రమాదేవి

ఇది సుప్రసిద్ధులగు శతావధానులు సత్యదుర్గేశ్వర కవులు రచించిన అయిదంకముల నాటకము. కథాసందర్భమున భారత దేశాభిమానము స్త్రీ విద్యావిషయములను గూర్చిన ఉద్బోధనలు కలవు. కవిత, కథాగమనము రసవంతములుగా ఉన్నవి.

గోలకొండ పత్రిక

